Presented to Sri Krishna Deva Rayala Andhra Bhasha Nilayam, Hyderabad

# శశికళాసుదర్శనీయము

in memory of the late young Author

గుంటుపల్లి శివానందకవి

విరచితము.

14-1-26.

రెండవ ముద్రణము 1000 ప్రతులు.



తెనాలి

శ్రీ త్రిపుర సుందరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించఁబడియె.

1923.

వెల రు 1—0—0





*To Commemorate the name of the Author*

*this book is re-printed.*

*"May the poet's soul rest in peace."*

# ఇందువచ్చు పాత్రలు.

(పురుషులు)

సుదర్శనుడు:— కథానాయకుడు 1, 2, 4, 5 అంకములు

భారద్వాజ మహర్షి:— 1 అం

యుధాజిత్తు:— (కథానాయకుని) మాతామహుడు 1, 4, 5 అం

మంత్రి:— ... ... ... 1 అం

విమలుడు:— (బ్రాహ్మణుడు) 1 అం

సుబాహువు:— (కథానాయిక తండ్రి) 3, 4, 5 అం

కేరళాధిపతి<br>
కళింగాధిపతి<br>
మాళవేశ్వరుడు<br>
శత్రుజిత్తు } స్వయంవరపు రాజులు 4 అం

చారుడు 3 అం

## (స్త్రీలు)

శశికళ:— కథానాయిక 2, 3, & 5 అంకములు.

చంద్రకళ:— కథానాయికతల్లి 3 అం

మాలతి:— చెలికత్తె 3 అం

ఈశ్వరి:— 5 అం

**పాఠక మహాశయులారా!**

ఇప్పటికి షుమారు ఆరు సంవత్సరముల క్రిందట యీ బాలకవిచే రచియింపఁబడిన మొదటి రెండంకములను ముద్రించితిమి. అట్లుసంపూర్తిగ నాటకముంచుటకు నిష్టములేక యీ సంవత్సరము మా మిత్రులలో నొకరిచే పూర్తి చేయించి మరల ముద్రించుటకు సాహసించితిమి. ఈ గ్రంథమును అచ్చొత్తించుటలో సహాయపడిన చందాదారులకును పూర్తిచేసి యిచ్చిన మా మిత్రుడగు మేళ్ళచెర్వు కుటుంబరాయ శర్మకును, ఉపోద్ఘాతము వ్రాసియిచ్చిన బ్రహ్మశ్రీ చావలి వెంకటకృష్ణయ్య బి. ఎ., బి.యల్. గారికిని కొలది కాలములోనే అచ్చొత్తించి దయచేసిన తెనాలి త్రిపురసుందరీ ముద్రాక్షరశాల యజమానులకును మాకృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచున్నారము. గ్రంథస్థదోషములు మెక్కులుండవచ్చును. వాటినన్నిటిని క్షమింప వలసినదిగా మిమ్ము ప్రార్థింపుచు యింతటితో విరమించుచున్నారము.

నర్సరావుపేట,<br>
8—8—23.

ఇట్లువిన్నవించువారలు,<br>
బాలకవి స్నేహితులు.

# పీఠిక.

శ్రీరస్తు.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

ఈ నాటకము కారణాంతరములచే బహుకర్తృకమైనది. అందుఁ బ్రథమ గ్రంథకర్త గుంటుపల్లి శివానందాహ్వయుఁడు. ఈబాలకవి తన హూణాభ్యాసనకాలముననే యీనాటకమునందలి మొదటి రెండంకములను రచించియుండెను. ఆతఁడు దైవవశమున నీగ్రంథమును సమాప్తము చేయకయే కాలధర్మమును జెందినాఁడు. ఇయ్యది యసంపూర్తిగనే ప్రదర్శనయోగ్యము గాక కొంతకాలముండినది. కొలఁదికాలమువఱకు దీనినే వారును బూరింపరైరి. ఇట్లుండ నీ బాలకవి జ్ఞాపకసూచకముగఁ దన్మిత్రులీ యసమగ్రభాగమునే ముద్రింపించి ప్రచురించిరి. ఇటు తరువాత నీగ్రంథములోఁ గొదువబడిన భాగమును బూరించి మేళ్ళచెర్వు కుటుంబరాయశర్మ రెండవ గ్రంథకర్తయయ్యెను. ఇఁకఁ దృతీయులు సుప్రసిద్ధులు తిరుపతి వేంకటేశ్వర కవులు వారిందేమియు బ్రసక్తి గలిగించుకొనినవారు కాకపోయినను దేవీ భాగవతములో కథయే గావున రెండవకవియగు కుటుంబరాయశర్మ సందర్భానుసారముగ వారి దేవీ భాగవతములోని పద్యములనిందుఁ బొందుపఱుచుటచే వారి ప్రస్తావన యిందుఁ దేఁబడెను. ఇట్లీగ్రంథము పరిసమాప్తి చేయఁబడినది.

## కథా సంవిధానము.

ఈ శశికళా సుదర్శనీయము దేవీ భాగవతమునందలి యొక యుపాఖ్యానము ఇందలి కథావిధానము ధ్రువసంధియను రాజునకు మనోరమా లీలావతులయందు సుదర్శన శత్రుజిత్తులను నిరువురుకుమారులు జనించుటయు, ధ్రువసంధి మృగయార్థ మడవికిఁబోయి యొక సింగముచేఁ ద్రుంగింపఁబడుటయుఁ బట్టాభిషేక విషయమున సుదర్శన శత్రుజిత్తుల మాతామహులగు వీరసేన యుధాజిత్తులకుఁ బోరుపొసగుటయు వీరసేనుఁడు రణనిహతుఁడగుటంజేసి రక్షకులులేమి మనోరమ సుదర్శనునితో భారద్వాజాశ్రమము జేరుటయు, యుధాజిత్తు సుదర్శనునిపైకేఁగి మునిభీతి మరలుటయు, కాశీరాజగు సుబాహునితనూజ శశికళ దేవీ కృపాలబ్ధుఁడగు సుదర్శనుని ప్రేమించుటయు, సుబాహుడు శశికళకు స్వయంవరమని ప్రకటించుటయు, శశికళ స్వయంవరమిచ్ఛగింపనిదై దీనుఁడగు సుదర్శనుని వివాహమాడవలదని తలిదండ్రులు పబడిగ బోధించినను వినక స్వయంవరాహూతులగు నరపతులకుఁ దెలియకుండఁ దండ్రిల యనుమతిని సుదర్శనుని వివాహమాడుటయు, శశికళాసహితుఁడై

పోవు సుదర్శనుని యుధాజిత్ప్రముఖు లెదిరించుటయు, అంత జగదంబ ప్రత్యక్షయై శత్రుజిద్యుధాజిత్తులఁ బరేతులఁ జేయుటయు సుదర్శన రాజ్యప్రాప్తియునై యున్నది. ఇది దేవీ భాగవతములో వర్ణింపఁబడినకథాక్రమము.

పై కథాక్రమము నాధారముచేసికొని యితఁడు తగుపాటి మార్పులతో నాటకరచనచేసి యున్నాఁడు. ఇయ్యది నాటక కర్తలందఱియందును సాంపదాయముగనే వచ్చుచున్నది. ఆవస్థాభేదమునుబట్టి పరిణామభేదమును బొందుట స్వాభావికము. "ఏకోరసోఽంగీకర్తవ్యోవీర శృంగార ఏవవా" అని దశరూపకమునందు ధనంజయుఁడు నిర్వచించినరీతి తన నాటకము శృంగారరసప్రధానముగ నుండవలెననియే యీతని యభిప్రాయమగునట్టుల విస్పష్టమగుచున్నది. ఆతఁడేలనో ప్రథమమునుండి రచింప మొదలిడక భారద్వాజాశ్రమమునఁ దానిడుములు పడుచుండుటనుగూర్చి సుదర్శనుఁడుగావించు ప్రలాపమునుండి ప్రారంభించినాఁడు. ఈకథలోని ప్రతిభాగమును నొకటి రెండంకముల నిముడ్చవలెనని యీతని యాశయము. కావుననే యీరూపకమున కధికారిప్రాయమగు శశికళా సుదర్శనుల సమాగమము నీభాగముననే వర్ణింపఁబడినది. ఏవో కొన్ని మనోజ్ఞములగు పదముల నొకపద్యములో నిముడ్చనెంచి యేపాదమునుండియో పద్యము ప్రారంభించినట్టుల నీయది విరసమై కనుపట్టదు. అవయవవిశిష్టమగు వస్తువునందుఁగల రామణీయకము ప్రత్యేకావయవమునందుఁ జూపట్టదు. ఎట్టివియగుఁ గాక పొందికయందే యందము స్ఫురించును. పాపము ఈకవికిఁ దనకవితా కన్యకను సర్వాంగ సౌందర్యముగలదానిగఁ జేసి లోకముతోపాటు తానును త్వరితార్థముఁ జెందుభాగ్య మలవడినదికాదు. ఈరెండంకములఁబట్టి యే యదార్థగుణ వర్ణనము దుష్కరము కాకమానదు.

## రచనాకౌశలము.

ఇతఁడాంధ్రముననేగాక సంస్కృతమునందును గావ్యనాటకాది పరిశ్రమమునకు దిగినట్టు లొకించుక యీతని రచనంబట్టి పొడకట్టుచున్నది. అందులో నితనికిఁ గాళిదాసుని కావ్యనాటకములయందుఁగల యభిరుచియు, నాభావములనే గైకొనవలయునను నభిలాషయు, గలయట్లు కొన్ని సూచనలుఁగలవు. అందుకై యొకటి రెండుదాహరణము లిచ్చుచున్నాఁడను.

గీ॥ పుష్పసదృశమైన పూఁబోడి హృదయమ్ము!
జీవితేశుఁడెపుడో జేరునెడి
తృష్ణబంధముండ దీపించునేగాని
లేకయున్న వాడిపోక యున్నె॥

III

ఇయ్యది

> ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశో హ్యంగనానాం
> సద్యఃపాతి ప్రణయిహృదయం విప్రయోగే రుణద్ధి ॥

అను మేఘసందేశములోని కాళీదాసోక్తికిఁ బ్రతిబింబమైయే పరగుచున్నది.

"మొదటి మనోహరపు మృదుత్వమేదక భాసురంబై తగుపల్లవం" బను పద్యము చదువుచో నభిజ్ఞాన శాకుంతలములోని

> "అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహైః, ॥

అను శ్లోకము స్ఫురణకు రాకతప్పదు. ఇఁక

> "చరమాద్రి మేఖలాంతరవిరాజచ్ఛోణతరమహాగైరిక ధాతువులన"

> "కాదంబినీబహిర్ధృతవీక్షణీయ సుందరమైన తొలుకారు మెరుపనంగ"

మొదలగు కల్పనలన్నియు నాంధ్రములగు ప్రబంధముల పరిమళములను వెదజల్లునవియే? ఈతఁడు తనకవితాధోరణియంతయుఁ బింగళిసూరనార్యుని "శబ్దసంస్కారమెచ్చటను జాఱఁగనీక పదమైత్రియ సంపదలఁ బొదల," యను లక్షణమును బ్రమాణముగ నుంచికొనియే చాలవఱకు నిర్వహించియున్నాడు. అందుకు,

> కలికీ! కాటుకకంటినీరు విడువంగానేల! దుఃఖాశ్రువుల్
> మలినంబు బొనరింపవే భవదమూల్యక్షీరనిష్ఠూతగం
> డలకాంతుల నింకనైన ననుఁ గాంతా! నీవు కేర్గంటి చూ
> పులధన్యంబొనరింపరాదె? క్షణికోపుల్ గారొకో యుత్తముల్ ॥

మొదలగు పద్యములె తార్కాణములు ఇతఁడు తన కథానాయకుఁడగు సుదర్శనుని ధీరోదాత్తునిగ వర్ణించినాఁడు. వర్ణించుటయే గాదు శశికళాముఖమున "ఔరా! ధీరోదాత్త లక్షణములివి కదా" యనికూడఁ బలికించినాఁడు. కొందఱు నాయకులలోకెల్ల నుత్తముఁడని తలఁచుచుఁ ధీరోదాత్తుని తమకావ్యమున నాయకునిగ వర్ణింపఁ బ్రయత్నింతురు. రచనాకౌశలము ప్రధానముగాని నాయకుఁ డెవఁడైన నేమి? ధీరశాంతుని నాయకుని వర్ణించినమాత్రమున మృచ్ఛకటికాదులకు లోటుకలిగెనేని? పాత్రగుణ వర్ధనమునందేమి తక్కిన విషయములందేమి సంస్కృత వాఙ్మయమున సాధారణములగు నాటకములన్నియు మృచ్ఛకటికమును బోలఁగలవే? కాఁబట్టి ప్రతివారును గతానుగతికముగ ధీరోదాత్తనాయక వర్ధనమున కేగఁడంగిన నాటకములన్నియు శ్రవ్యప్రబంధముల రకమునకే దిగును. కాని నాయకగుణవర్ధనమున నితం డొకించుకయేని దొసఁగు పొసఁగకుండఁగ జీవకళ కల్పించినాఁడని చెప్పకతప్పదు

# IV

## నీతి.

కావ్యమునుబట్టి కవ్యభిప్రాయము లూహింపఁదగియుండును. ఈతఁడు దేవి భక్తిగలిగిన యాస్తికుఁడనఁదగియున్నాఁడు. లేదేని నీకథను గైకొననివాఁడె. షేక్స్పియరు నాటకమునో యాంధ్రీకరింప మొదలిడియుండును. దేవికృపకలిగినవారి కెద్ది యు నసాధ్యముకాదను నీతిప్రధానముగ నిందు నుపపాదింపఁబడినది. మఱియు నుత్తమకన్యారత్నములకు స్వయంవర మర్హముకాదనునట్టిదియు, సేవావృత్తి శ్వవృత్తికన్న నీచతమమనునట్టిదియు మొదలగునవి గౌణములు. దైవవంచితులు కానివారి కందరాని పదవి యెందును లేదనునది యాస్తికుఁడగు ప్రతిమనుజుఁడును నొప్పుకొనఁదగినదియె. ఇఁక స్వయంవరములు శశికళ వచించినట్టుల కులస్త్రీల కుచితంబులుకావు. పూర్వకాలమున నీస్వయంవరము లెట్టు లాదరణీయములయ్యెనో చెప్పఁజాలము. కాని యవి యన్నియు నరపతుల నెడతెగని కలహములకుఁ బురికొల్పు పణములెయైనవి. దమయంతీస్వయంవర మెట్టిది. ద్రౌపదీవివాహమున నేమయ్యెను. అంబాంబికాంబాలికల వివాహమున నంకురించిన కలహబీజ మెంతవఱకు వృద్ధిఁబొందినది. లక్షణాపరిణయమునాఁటి కృష్ణునిపై విరోధము శల్యుఁడు మరణాంతముదనుక మరవఁవలిగెనే? ఆ యాయీవిషయము లన్నియు దేవీభాగవతమునుండి యనువదింపఁబడినవే? వీనిలో మన బాలకవి స్వీయాభిప్రాయము లెవ్వియులేవు. ఇతనికిఁ సేవావృత్తియనినఁ గడుంగడు నీసడింపు. అందునకు,

> "పరులకు దేహమమ్ముకొనఁ బొల్పడుఘోరల కెందుఁగాని దుర్భరమగు కష్టకార్యము".

> "పెండ్లిపీటల పరివేష్టించియున్నను యజమానునాజ్ఞను నడగవలయు"

> "అష్టకష్టంబులం దొక్కటైన నీచసేవకావృత్తి"

అనుపద్యములె ప్రమాణములు. ఇందులో "పెండ్లిపీటల" యను పద్యపాదములోని విషయమొకప్పు డొకలేఖకునిపై నీయూరనే ప్రయోగింపఁబడిన యధికారబాణమే యగునని వదంతికలదు. ఇతఁ డీయభిప్రాయమును గేవలము వాగ్రూపముగ గ్రంథమునఁ జేర్చినమాత్రపువాఁడుకాఁడు. సేవయందలి హేయభావముచేతనే నిర్నిమిత్తముగఁ దనయుద్యోగమునకు రాజీనామా యిచ్చినయుదారుఁడు. నిజమునకు నితని యందలి సుగుణసంపత్తి చూచి యానందింపఁదగినవేకాని వ్రాసి యానందింపఁజేయఁదగినవికావు. తీఁగపందిలి యొక్కకయే భారతరణావని సౌభద్రుని స్మరణకుఁ దెచ్చుచు బాల్యముననే స్వర్గ మలంకరించినాఁడు.

ఈనాటకమునకుఁ బ్రస్తుతరూపమును గలిగించిన కుటుంబరాయశర్మగారి పరిశ్రమము ప్రశంసనీయము. కథాసంవిధానము తనమనమున కెట్లు పొడగట్టినను, బూర్వకవిరచన యేవిధముగ సాగినను వానికనుగుణ్యముగఁ గథాశేషమును ముగించి నాటకమునకుఁ బ్రస్తావన వ్రాసి బాలకవి మిత్రుల యుద్యమమును కొనసాగించినందున వీరును మన ప్రశంసకర్హులే! ఆంధ్రభాషయందుఁ జక్కనిసాహిత్యము కలిగి పద్యరచనాకౌశలము సంగ్రహించి యభినయశాస్త్రప్రవేశము గడించిన వీరిట్టిపనికి సమర్థులౌదురు. వీరిస్వతంత్రరచనలుగూడఁ గలవు. రామాయణము నంతయు నాటకరంగమున కనువగునట్లు దృశ్యరూపముగ వ్రాసి నాటకసమాజములచేఁ బొగడ్తగనియున్నారు.

## కవివంశము.

ఈబాలకవి నివాసము నరసరావుపేటతాలూకా చెన్నుపల్లెఅగ్రహారము. ఇంటిపేరు గుంటుపల్లివారు. సుప్రసిద్ధమైన నందవరీకశాఖవాఁడు ఇతనివంశము మొట్టమొదటినుండియుఁ గ్రమాగతముగ విద్యాసంపన్నతగలిగి దాతృత్వమున కాలవాలమై ప్రసిద్ధిగాంచిన పండితవంశము. ఈఆంధ్రమండలమున నీవంశమునుగుఱించి కవివిని యెఱుంగని గేస్తులేఁడనిన నతిశయోక్తి కానేరదు. విద్యయు, నందుకుఁదగిన వినయమును, దానికి వన్నెపెట్టు పెద్దలయందలి భక్తియు, దానిని బ్రకాశింపఁజేయు దాతృత్వమును నీవంశముననే పుట్టిపెరిగినవి. వీరిదానశీలతకు నీషణ్మాత్రమేనియు మిగులక యగ్రహారమంతయు వ్యయమగుటయే దృష్టాంతము. వీరిచారిత్రమును బోలినది పురాణముల నొకరంతిదేవోపాఖ్యానమే యగుచున్నది. ఈతనితండ్రి యుభయభాషాసాహిత్యము గలిగి నానాపురాణాధ్యేతయై నిరతాన్నదాతయని పేరుఁగాంచి ర కీర్తిదేహముతో నాంధ్రదేశమున వెలుఁగొందుచున్న గుంటుపల్లి గోపాలకృష్ణాహ్వయుఁడు. ఇట్టిసత్కుటుంబమున జననమొందిన మనశివానందకవి ముక్కుపచ్చలారని పిన్నతనముననే యుభయభాషాసేవ చేసి గ్రంథరచనకుఁ గడంగి బుద్బుదప్రాయమని పంచభూతాత్మకదేహమును వదలి యశోదేహమును గాంచినాఁడు. ఇతనివంశము యొక్కయు నితనియొక్కయు యోగ్యత మేము స్వయముగా నెఱిఁగినదియే యగును పరమేశ్వరుఁ డితనియాత్మకు నిత్యశాంతి యొసగూర్చుఁగాతమని యింతటితో విరమించుచున్నాఁడను.

నరసరావుపేట.<br>9-8-19[illegible]3.

చావలి వెంకటకృష్ణయ్య.<br>బి. ఏ. బి. ఎల్.

# అవతారిక.

**"A reader seldom peruses a book with pleasure, until he knows whether the writer of it be a black or a fair man, of a mild or choleric disposition, married or a bachelor with other particulars of the like nature, that conduce very much to the right understanding of an author".**

**Addison's *Spectator*, No. 1.**

ఈగ్రంథము రచియించినవాఁడొక బాలుఁడు. పదునెనిమిది సంవత్సరములు ఉండి లేనివాఁడు. గుంటుపల్లి వంశంబున నవతరించినవాఁడు. శివానంద నామధేయుఁడు. నర్సారావుపేట తాలూకా చెన్నుపల్లె గ్రామమునివాసి. ఈతఁడు గుంటూరు కాలేజీయందు 1913 సం॥న స్కూలుఫయినలు పరీక్షయందు కడతేరి, వేసంగి సెలవులలో ఒక కన్యారత్నమును పరిణయమాడి, ఆసంవత్సరం జూలై మాసమున నర్సారావుపేట తాలూకాయందు గుమస్తాగా ప్రవేశించెను. ఈగ్రంథకర్తకు సంస్కృతము చదువుటయందు చాల నభిలాషకలదు.

పాపము! యీ బాలకవికి రేయుంబవళ్లును గుమాస్తాపనియందే కాలమంతయు వృథాఅయినదికాని, సంస్కృతభాషాజ్ఞానాభివృద్ధికి ఒక్కగడియయైన తీరికయుండినదికాదు. ఇదియునుగాక స్కూలుఫయినలు చదువుతూ వ్రాశియుంచిన యీ యసంపూర్తి నాటకమును పూర్తిచేయుటకు ఒక నిముసమైనను అవకాశము చిక్కినదికాదు. పై రెండు కారణములచే యీతఁడుచేయు, ఉద్యోగమునకు రాజీనామా (Resignation) పనిలోప్రవేశించిన యారుమాసములకే యిచ్చి గుంటూరు వచ్చియుండెను. ఆహా! కాలమహిమ! కాలమాసన్నమైనవానిని అట్లు యీడ్చుకొనివచ్చుట కాలధర్మము కాఁబోలు? అట్లు వచ్చిన మామిత్రుండు, కతిపయదినంబులకు ఘోరకలిగా పట్టణమూడ్చుచున్న స్ఫోటకము (అమ్మవారి) చే వంచితుఁడయ్యె, పది పండ్రెండు దివసంబులు మంచమున బాధపడి 1914 సం॥ జనవరి 15వ తారీఖున మాదురదృష్టవశంబున కాలగతిఁ జెందెను.

ఈతఁడు గతించిన, 10-12 దివసంబులకే సోదరుడును తమ్మునియొక్క వియోగబాధ కోర్వలేకపోయెనో యనునటుల యాతఁడును గతించెను. ఇటుల ఉన్న యిద్దరు కొడుకుల చంపుకొనిన యాతండ్రియొక్క హృదయవేదనను చదువరులే యూహించుకొందురుగాక. ఆవృద్ధుఁడు- అజీవి ఎవరోకాఁడు. " ప్రబంధ కల్పవల్లరి " యను మాసపత్రికను అప్రతిహతముగ నడపినట్టియు, పండితాగ్రేసరుండును, కవిసార్వభౌముండును, ధర్మపథగామియు, నిరతాన్నప్రదాతయు, సకలభూత దయాంతరంగుండును, కీర్తిశేషులు నగు జగన్నుత గుంటుపల్లి గోపాలకృష్ణ నామధేయుండు.

ఈగ్రంధకర్తను గూర్చి చాల వ్రాయవలసియున్నది. కాని, గ్రంథవిస్తర భీతిచే నాపనివదలి సంగ్రహముగ గొన్నివాక్యము లుదహరించి విరమించెదము. ఈబాలకవి రచించిన పద్యములు కొన్ని మాలో నెంకరు పఠించి, ఆయాపద్యములఁగొందరు కవులయొక్కయు, పండితులయొక్కయు, సముఖమునఁజదువుట తటస్థించెను. వారిక్కవి కవితానైపుణికిని యీతని యనర్గళ వాగ్ఝరీమహిమకును, శైలిమార్దవంబునకును, అచ్చెరువడి సెబాసని పొగడిరి. వాటికి గలిగిన అత్యాదరణ మమ్ముల్ల ప్రోత్సహింప వర్తమానకవి ప్రముఖులలో ననేకుల నీయసంపూర్ణ గ్రంథమును, పూర్తిచేయుఁడని ప్రార్థించితిమి. కాని నిష్ఫల మనోరథుల మైతిమి. ఎవరికిని ముందడుగు వేయ సాహసము చాలదాయెను. కావున నిక నాపద్యముల నూరక వదలివేయుట కిష్టములేక ఉన్నంతవఱకే తెరంగున నచ్చొత్తించితిమి. కావున నిఁక పండితులకును, కవులకును విజ్ఞప్తి చేయునదిఏమన; ఈ పాత్రమును సాంగముగ చదువుటయు, ఏరైన మహానుభావులు పూర్తిచేయుటయు, జరిగినయెడల వాటినన్నిటిని ద్వితీయ ముద్రణమున అచ్చొత్తించి ప్రచురించెదము. అట్టివారలకు మేమెంతయు గృతజ్ఞులమగుదుము.

ఈక్రింది రెండు పద్యములును కవికృతములు.

మ॥ పరభూపాలక సైన్యస్రుగ్ధృచుల సంభావించుటల్ బోయి యీ

పరసాధ్వీమణికంఠ రక్తము సమా ♦ శ్వాసింపనున్నావె యో
పరమద్రోహి! కృపావిహీన! అనదా! పాపాత్మ! సత్కీర్తితో
భరమౌ వెల్మకులంబు నాశనముకై ♦ ప్రాపించితే ఖడ్గమా!

చ॥ ఇలఁగలజీవకోటికేపుడేని వి ♦ యోగపునస్సమాగమం
బులు సహజంబులయ్యు మన ♦ ముద్దెగ దెంపుల కోర్వఁజేయ గా
సిలెడుశరీరదూరగతిచే ♦ మునుగల్గిన ప్రేమబంధముల్
తొలగుగదాయటంచును నె ♦ దోగతి స్వాంతముతాప మొందెడున్.

| గుంటూరు. | ఇట్లు విన్నవించువారలు, |
| --- | --- |
| | బుధజన విధేయులు, |
| 18 వ యేప్రియల్ 1917 | బాలకవి స్నేహితులు. |

పాఠకమహాశయులారా!

ఈ గ్రంథమున కాదికర్త యెవరన నిరుపమాన పాండిత్య యశఃకాముడును పండితకవులలో జేర్కొనదగినవాడును నగు గుంటుపల్లి శివానందమను బాలకవి. ఆతడు విద్యార్థిగా నుండునప్పుడే యీనాటక రచనకు గడంగి యెక్కారణంబుననో 2,3 అంకములను మాత్రము మొదట పూర్తిగావించి తక్కినది సమాప్తినొందించుటకు సంకల్పసిద్ధుడు కాక పూర్వమే, తోటిహితులకును, తల్లిదండ్రులకును, బంధువర్గమునకును దీరని వంతగలుగ పాపభూయిష్టమగు నీ ప్రపంచమున నుండుట కిష్టము లేకనో శారదాదేవిని సేవించి తన విద్యాసంపాదను బడిసివచ్చుటకో నకస్మాత్తుగా నెల్లరవీడి యకాలమృత్యువనుమార్గ మధిరోహించి చనిరెం. అట్టి ఘోరవార్తను స్మరణకుదెచ్చుకున్న కటికవానికి గూడ గుండె ఝల్లుమనక మానదన యతిశయోక్తికాదు. అట్టి ఘోరసంతాపమున గుందు మిత్రమండలికి నప్పుడప్పుడు కొంతశాంతి గలుగజేయుట కోయన నీ "శశికళా సుదర్శనీయ" నాటకరాజమును మాత్రి మిచ్చుట దిగవిడిచిపోయినందులకు గొంతశాంతి గనుచుంటిమని విన్నవించుటకు నే పత్రిధముడనయ్యెద. ఆతని కవితా నిపుణతను ప్రసంగించుటకు నా

బోటి యజ్ఞులకు తరముగాకుండుట నింతట విడచిపుచ్చెద. దానికి రస
జ్ఞులగు చదువరులే యూహింప సమర్థులు.

అట్లాదికర్తచే రచింపఁబడిన యీ యసంపూర్తి నాటకమును
శాశ్వతముగ వెలయింపనెంచి కొందరు "బాలకవి స్నేహితులు" శక్తి
వంచనలేక ఆరు సంవత్సరముల క్రింద ముద్రించిరిగాని యంతటితో వారు
తృప్తినిగనక పూర్తిగావించి స్థిరముగ నుంపదలంచి నన్నీపనికి ప్రోత్సా
హపరచిరి గాని చిత్రవిచిత్రవర్ణనలతో, తేనెలొలుకు ముద్దుమాటలతో
గాంభీరయుక్తమగు భావములతో రసపోషణాలంకార సమన్వితమగు
రంగంబులతో నలరారు యీ బాలకవి పోకడలతో సరిసమానముగ
వ్రాయజాలని నశక్తుడనగుటచే కొంతవఱకు కాలము జరపితినిగాని చివ
రకు తప్పనిసరియగుటచే విధిలేక నేనీపనికి బూనుకొనవలశి వచ్చినది.
అందుచే నెట్లు సమర్థించెదనా యని యాందోళమనస్కుడనై యుండు
తఱి బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి వెంకటేశ్వరకవులు రచించిన
దేవీభాగవతములోని కథాభాగము విపులముగా గనుపట్ట కొంతవరకు
ధైర్యము దెచ్చుకొని సందర్భానుసారముగ నందులోని కొన్ని పద్య
ములను గైకొని నాశక్తికిగగినట్లు తక్కుంబడిన గద్యపద్యముల వ్రాసి
పూర్తిగావించితిని. అట్టి యుత్తమోత్తముడు వ్రాసిన గ్రంథమును పూ
ర్తిగావించుటకును ప్రస్తావన వ్రాయుటకున్నూ, భారము విశేషముగా
మిత్రమండలి నాపై నిడుటచేతను విద్యాగ్రంథమంతగాలేని మూఢుడ
నైన నేను నాశక్తినైన పరిగణింపక నీసాహసమునకు గడంగితిని గాన
చదువరులు నాయసమర్థత్వమును పాటింపక నా సాహసమునకు నన్ను
క్షమింతురుగాకయని ప్రార్థించుచున్నాడను నాకిట్టి నూతన్న గౌరవమును
బలవంతముగా నాపై నిడి నన్నీవిధముగా పండితుల పాదములచెంత బడ
వేశి వారి యాశీర్వచనముల నందుకొను భాగ్యమును నాకు లభింపజేసిన
నా హితులకు నా వినయపూర్వక వందనము లాచరించుచున్నాడను.

నర్సరావుపేట,
20—6—23.

ఇట్లు విధేయుడు,
మేళ్ళచెర్వు కుటుంబరాయశర్మ.



# శశికళాసుదర్శనీయము.



## ప్రస్తావన.

శ్రీనవచిద్విలాసముల • చేత వశీకృతుఁడౌచు రాధికా
జ్ఞానన మెచ్చుచున్ "శశిక • ళా" యను ముద్దులపేరఁ బిల్చిన
న్మానముమీఱ ముద్దుగొని • మానసమున్ హరియించు భక్తసం
త్రాణుఁడు వైరినాశన సు • దర్శనధారుఁడు బ్రోచుగావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర—(సభఁ గలయంజూచి) ఈసభాసదుల యుత్సాహమునకును మారిషుని యాలస్యమునకును సరిపోయినది. ఈతఁ డెప్పుడును నట్టేట బుట్టిముంచువాఁడు. ఐన గార్యాచరణభారవహుండనగు నేను మంచిగ సంచరించి నాయుద్యమము కొనసాగించుకొనవలయు. గాన పిలిచెద. (పరికించి) మారిషా! వీలంగానున్న నొకమారిందు చ్చెదవా?

మార—(ప్రవేశించి) ఆర్యా! ఇదే వచ్చుచుంటిని. ఏమి శెలవు?

సూత్రి—ఓయీ! నీ వెప్పుడుగాని యేదియో సంకల్పించుకొని సమయమునకు వెనుకాడుచుందువు. మునుముందే నిన్నుఁ బ్రార్థించి వచ్చినందులకా నేఁడు మరింత యాలస్యమొనరించితివి. నేపిలిచి వచ్చినదే యెఱుంగవా?

మారి—బావా! ఎఱుఁగుదును. ఈ యాలస్యము నాబుద్ధిపూర్వకముగ చేసినదిగాదు.

సూత్ర—మఱి నీయాలస్యమునకుఁ గారణమేమి?

మారి—మాబంధుగులింట వివాహకార్యమునకాహ్వానింపఁబడి పోయితిని. గాని యంతకుముందే యాపెండ్లికూతు రొకని మనసార గోరి వరించియున్నదఁట. తల్లిదండ్రులు మాట్లాడినమనువున కిష్టపడకపోవుటచే యిరువురు పెండ్లి కాహూయమానులగుట పాపమాతఁడు చేయునదిలేక పిల్లపై భ్రాంతిని వీడలేక చివరకు పిల్లయిష్టానుసారమే వివాహము గావించినందున నేనచట నుండ పాడిగాఁ

ని పరుగున తప్పించుకొని వచ్చితిని. ఇంతలో నీవు పిలచితివి. కాని బావా! నన్ను రాగోరిన కార్య మేమి?

సూత్ర—మిత్రమా ! వేళ నన్నడుగవలెనా ? ఈసభాసదులం జూడవా! వారి యాగ మనకార్యం బెరుంగవా?

మారి—బావా ! ఏదియేని రూపక మభినయింప నెంచితిరా ?

సూత్రి—ఔను.

మారి—ఏనాటక మభినయింప నెంచితిరి?

సూత్రి—ఆదివఱ కేరూపక మభినయింతునా యని యాందోళనలో నుండ నీవు నుడివిన పెండ్లిచారిత్రిమును విని తదనుగుణ్యమగు చారిత్రమునే ప్రయోగింప సిద్ధపడితిని.

మారి—అది యెయ్యది ?

సూత్రి—శశికళాసుదర్శనీయమను నూతననాటక మొకటి లభింప పతించితిమి.

మారి—దానిని రచించిన దెవరు ?

సూత్ర—ఎవరని చెప్పుదు? ఆచారిత్రిమును చెప్పుటకు చాలా సంతాపకరముగా నున్నది.

మారి—బావా ! ఏమి చిత్రముగా నుడువుచుంటివి ?

సూత్ర—ఔను. అంతయుం జిత్రిమే ! సంగతి యెట్టిసంతాపము గూర్చునదియైన చెప్పకతప్పదు. వినుము.

మ॥ సరసుం డార్యనుతుండు గుంటుపలివం ♦ శాంబోధిచంద్రుండు జ్ఞా
నగతుం డద్భుతస్నేహపాత్రుండు శివా ♦ నందంబు ధీమంతులం
దరు మేల్ మేలనవ్రాసి కొంతవరక ♦ ద్ధాయుష్యుఁడౌటన్ గటా!
మరణించెన్ బసునెన్మిదేట తనవ్రే ♦ మన్ బాసి కావ్యంబుపై !——

మారి—ఐన నార్యా ! మీరిప్పు డాదయత్నించునది యా యసంపూర్తి కథయేనా

సూత్రి—అద్దానిని మేళ్ళచెర్వు వంశజుండు కుటుంబరాయకవి, బాలకవి స్నేహితులు బలవంతపెట్ట పూర్తిగావించెను.

మారి—ఆరా ! శివానందుని కవిదాశక్తి నిరుపమానము అంగ్రళము, అతిమాధుర్యము నుగదా ! అట్టిదానిని పూర్తిగావించుటకు శాస్త్రపరిచిత లేక నాటకపఠనసంపాదితజ్ఞానంబుచేఁ గలిగిన సామర్థ్యంబునకు గర్వించి యీపనికిఁ బూనెనా? పాపము నెమలిరెక్కల ధరించిన కాకిచందంబున హాస్యాస్పదు డగునే మోగదా?

రాత్రి —

ఉ॥ ఎఱుఁగక గాదు సూవె తన ♦ దెంతటి శక్తియొ? మిత్రకోటి వే
మఱు బలవంతపెట్ట మరు ♦ మాటను బల్కఁగలేక సాధ్యమా
వఱకును "దేవిభాగవత ♦ పద్యములన్" గ్రహియించి కొన్నియా
కొఱతగలట్టి భాగములఁ ♦ గూర్చెను కొంతలొ కొంతమేలుగా!

నీవనినట్లింతగా శివానందమునకు సాటిరాకున్నను కుడియెడమ భేదము రసవంత
ముగానే యున్నది. ఎటులైన మిత్రవాత్సల్యమున బూనినవారి నిరసింపరాదు.

మారి — ఒహో! యీనాటకము మువ్వురు నల్వురు కవులు కలసి వ్రాసినారని నమాట.
ప్రారంభించినది శివానందం. పద్యములు తిరుపతివెంకటకవులవి. పూర్తిచేసి
నది కుటుంబరాయకవియునా? ఆర్యా యిన్నిచేతులు కలసిన యీనాటకము
రసవంతముగా నుండదేమో అని భయపడుచున్నాను.

సూత్రి — ఓయి పిచ్చివాడా! నీకట్టిభయంబు వలదు. నాటకమంతయు సాంగోపాం
గముగ తిలకింపుము. తదుపరి నీకీసందియము పోవుటయేగాక మరల ప్రదర్శిం
పవలసినదిగా నీవే కోరగలవు. అదుగో శివానందం వ్రాసిన నాటక మెప్పు
డు నాడుదుమా అందు సుదర్శనవేషధారినై యాపద్యముల నెప్పుడు చదువుదు
నా అని సంవత్సరములకొలది నాందోళపడుచున్న మనమిత్రుడు భారద్వాజా
శ్రమంబున సుదర్శనవేషంబున ప్రవేశింపబోవుచున్నాడు. ఇప్పటికే కాలహ
రణమైనది. మనము పోవుదము పద.

మారి — ఆర్యా! ఎట్టిసందర్భమును లేక అంతటి మహారాజు గారాబుతనయు డీసుద
ర్శను నిట్లు దీనస్థితియందు భారద్వాజాశ్రమంబున ప్రవేశింపచేయుట భా
వ్యము కాదు. దీని పూర్వగాథ యేమో సభాసదుల కెఱింగించినగాని వా
రలకు నాటకమునందంతగ నభిరుచి గలుగదు.

సూత్ర — మంచిది. శివానందమును యీసుదర్శన ప్రవేశము ద్వితీయాంకముగ నే
యెంచియుండి ప్రథమాంకమున నేమియో సందర్భానుసారముగ వ్రాయదల
చెను. ఇంతకు జరిగినవిషయములం గూర్చి చింతిలి యేమిప్రయోజనము.
పూర్వకథాసందర్భమునకు గూడ దేవీభాగవతమే మనకు శరణ్యము. దాని
నిదిగో చెప్పుచున్నాడ వినుము.

మ॥ అలరారున్ సరయూతటమ్మున నయో ♦ ధ్యాపట్టణాబ్ధి కో
సలదేశమ్మునకెల్ల భూషణముకం ♦ జాతాప్తవంశ్యుండు కీ

త్ర్యలఘుం దప్పరి నేలుచుండు ధ్రువసం ◆ ధ్యాఖ్యుండు రారాజు వి
ప్రులు రాజన్యులు వైశ్యులుంగలరు శూద్రుల్ తత్పురిన్ ధార్మికుల్॥

ఆరాజన్యునకు మనోరమయు లీలావతియు ననువిద్దరు భార్యలుకలరు. వారి
ద్దరియందు సుదర్శనుండు శత్రుజిత్తును కుమారులిరువు రుదయించిరి. ఒక్క
నాడు ధ్రువసంధిమృగయావినోదార్థం బడవి కేతెంచి యనేకమృగమ్ములను
క్కడంచుచు నొక్కనికుంజమ్మునందలి సింహముల కొట్టుడు దానిచే నిహ
తుండయ్యె. అంత న్యాయానుసరణి జ్యేష్ఠుండగు సుదర్శనునకే పట్టాభిషేకం
బు జరుగవలసిన సమయంబున ఉజ్జయినీపురంబునుండి యుధాజిదాఖ్యుండు
తన దౌహిత్రుండగు శత్రుజిత్తునకు పట్టాభిషేకంబు సేయుతలంపున నేతెంచి
నంతయు విఘ్నంబొనర్చి సుదర్శను మాతామహుండగు వీరసేనని పరిమార్చి
సుదర్శను పట్టఁ బెట్టుటకు ప్రయత్నింప, ఆబుడుతడు తప్పించుకొని భారద్వా
జాశ్రమంబు చేరి కాలము గడుపుచుండు; ఇయ్యది పూర్వకథాసందర్భము;
తదుపరిగాథయే యీనాటకము. మారీషా! ఇంకాలస్యము చేయుట భావ్య
ము కాదు. పోదము పద.

( అని నిష్క్రమింతురు. )

ఇది ప్రస్తావన.





# శశికళాసుదర్శనీయము.



## ప్రథమాంకము.

### ప్రవేశము—సుదర్శనుఁడు.

సుదర్శనుఁడు - (విషాదముతో)

శా. చతురంభోనిధిమేఖలాయిత ధరా ♦ చక్రాధిపుండౌ మహా
క్షితిపాలాగ్రణిముద్దుపట్టినయి వా ♦ సింగన్న యావీరసే
నతనూజాతసుతుండనై యఖిలభూ ♦ నాథత్వముంగాంచఁబా
ధ్యతఁబేర్వాసివహింపఁగాఁదగిన నా ♦ కా యిట్టిదౌర్గత్యముల్॥

ఔరా! దైవవైపరీత్యము. చతుస్సముద్రముద్రితమహీచక్రమునెల్ల నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన యాధ్రువసంధిమహారాజు బీరము నిస్సారమై నేటికి నాకెట్టిగతి ప్రాప్తించవలసి వచ్చినది? ఆహా కాలమహిమ!!

చం. భువిరథచక్రముల్ తిరిగి ♦ పోయి పొరింబొరి క్రిందుమీఁదుగా
నవుగతిఁ గాలచక్రమహి ♦ మాతిశయంబునఁ బూరుషుండు తా
నవిరళదుఃఖముల్ సుఖము ♦ లప్పటికప్పుడుగాంచు రాజుఁబం
టవు మఱిబంటురాజునగు ♦ నందొకటైన ధ్రువంబుకాదుగా॥

ఆనాటి మజ్జనకు నిజస్థితికిని నాగతికిని నెంతతారతమ్యము కలదు? అక్కటా!
నేనన్నివిధముల దౌర్భాగ్యుఁడనే కదా? తండ్రీ!

మ. కనుటన్ బుత్రునిముద్దుముచ్చటలు నీ ♦ కండ్లారవీక్షించియే
గినదీవంతగలేదు నేసుతుఁడనై ♦ కేల్మోడ్చి మీసేవఁజే
సినభాగ్యంబిసుమంత లేదుగద? యి ♦ స్సీ యిట్టికాలమ్మునం
దుననీవీయటవిన్ గతించి ఋణమిం ♦ దున్ నాకుఁ జేకూర్చితే॥

(ఆలోచించుచు) మాజనకుని మహదైశ్వర్యస్థితిఁదలఁచి నాప్రస్తుతస్థితికివగచుట
చేతనమనియే నాతాత్పర్యము. అమ్మహాత్ముని పూర్వపుణ్యఫలముంజేసి మహా

వైభవుఁడగుటచే నాకును నాస్థితియే యలవడవలెనా? నాపూర్వపుణ్యసంస్కార మెట్టిదో!

ఉ. హాయిగఁజంద్రకాంతఖచి ♦ తాలయవీథుల సంచరించునే
నీయెడనీమహాటవుల ♦ నీలనలీతరుకుంజపుంజపు
ష్పాయతవాటినీమునిమ ♦ హాశ్రయతన్ జరియించుటెంతయున్
న్యాయమె? పూర్వజన్మసుకృ ♦ తాకృతకర్మలుతీర్తవోవునే?

అట్లగుటచే నాపూర్వస్థితిఁదలఁచి వగచుటెంతయు ననుచితము. తిన్ననిబుద్ధితో నాలోచింపఁబ్రస్తుత స్థితికూడ నాకంతదుఃఖదాయకము కాఁగూడదు. మనస్తృప్తియున్నచో మానవుఁడేస్థితిలోనున్నను సౌఖ్యమనుభవించుచునే యుండును. సంతృప్తిలేనివానికి మహారాజపదవిమాత్ర మతనికి తృప్తికరమగునా? అంతకంటె నున్నతపదవికై యాతనిమనస్సాందోళన పడుచుండదా? కావున నాయీజీవితములో ననుభవించుచున్న మనసౌఖ్యము మహారాజునయ్యు నేఁ బొందఁజాలనని నాయభిప్రాయము. మనస్సునకే చీకుఁజింతలు లేక స్వతంత్రజీవినై

గీ॥ పరులుపండింపనట్టి యీ ♦ ఫలచయముల
ఒరులస్వాతంత్ర్యముల్ లేని ♦ యుదకములను
సర్వజనసేవ్యమైన నీ ♦ చల్లగాలి
ననుభవించెడి నాసుఖ ♦ మాలఁతియగునె!

బ్రహ్మతేజస్కుఁడై బ్రహ్మవిద్వరిష్ఠుఁడై బ్రహ్మధ్యానలీనమనస్కుఁడై బ్రహ్మానందితుఁడై బ్రహ్మసాక్షాత్కారుఁడై బ్రహ్మర్షియగు భారద్వాజమహాముని సేవ నాజన్మశత పుణ్యఫలితమనంతగుణితమై ప్రతిఫలించుటఁజేసి ప్రాప్తించెఁగాని తదన్యసుకరలభ్యమా? మఱియు

మ. జనవంద్యుండగు నిమ్మహామునిని ని ♦ చ్చల్ గొల్చుటంగాదె నా
కనుభూతంబులుగాఁదటస్థపడెనా ♦ యావిద్దెలున్ మంచిచె
డ్డనిరూపింపఁగఁగల్గుప్రజ్ఞయునునిం ♦ తన్నేమహారాజనై
కనుమిన్ గాంచగలేనినాఁడుగలుగం ♦ గా నేర్చునో నేరదో॥

నిజముగా నాకీయున్నస్థితియే మహానందదాయకము. తదన్యమును ముమ్మాటికిం గోర. [ఆకసమువైపుజూచి] అదిగో త్రిమూర్త్యాత్మకుఁడగు సూర్యభగవానుఁ డుదయాద్రి పైనించుకించుక ప్రాఁకుచున్నాఁడు. ఈకర్మసాక్షిమూర్తియెంతయు నానందదాయకమై యున్నది. దేవా! చండకరా!

శా. నీయాకాంతులు తెల్విలోకమునకున్ • నీవేమికన్మాత్ర యా
యాయాకర్మలునీదుమూలకముల • య్యా! నీవు సాక్షుండవై
చేయంగల్గునకృత్యకృత్యములకున్ • జీవంబుగాచంద్రమః
ప్రాయఃకాంతులకీవు; లోకభరణ • వ్యాపారముల్ నీవె సూ॥

సూర్యోదయముకూడ నైనది. కాలకృత్యములనెరవేర్చి మాగురుఁడగు భారద్వాజుఁడు నేటికి వచ్చుచుండును. ఎదుర్కొందునుగాక. (అని ముందుకు నడిచి పరీక్షించి) అదిగో నాదైవమగు భారద్వాజమహర్షి యిదేవచ్చుచున్నాఁడు. ఆహా! బ్రహ్మతేజోమయమగు నీమూర్తిసౌందర్య మెంతని యభినుతింపవచ్చును? (అని యెదుర్కొనుచున్నాఁడు)

భార— మ. అరయన్ శూక్ష్మపిపీలికాదులను • ఘోరాకారసర్వంసహా
ధరరాజమ్ముల నొక్కరూపమున వ్యా • ప్తంబౌ పరబ్రహ్మమున్
స్థిరభక్తిన్ గొనియాడియున్ మనసుతృ • ప్తింగాంచదయ్యెంగదా?
అరరే! తన్మహిమంబులీప్రకృతియందా! లోకమానెయ్యెడన్॥

(అనుచు భారద్వాజుఁడు ప్రవేశించుచున్నాఁడు)

( సుదర్శనుఁడు - పాదాక్రాంతుఁడగుచున్నాఁడు. )

భార— ( లేవఁదీసి ) కుమారా! నీవిట నేయున్నావా! దైవకృపచే నీమనస్సు నిర్మలముగ నున్నదా?

సుదర్శ - దేవా! మీకృపయే సర్వవిధముల శ్రేయోదాయకము.

భార— కుమారా! నాయందుగల భక్తిప్రేమలచే నీవట్లంటివేకాని ఈశ్వరకృపయు నీపూర్వభాగ్యమును నిన్నుద్ధరింపవలెఁగాని నాప్రజ్ఞయేమున్నది.

సుదర్శ - మహాత్మా! అట్లనెదరేల?

ఉ. క్రూరయుధాజితాధమున • కున్ ననుబాల్పడకుండఁజేయ వి
స్తారకళావిశేషవిల • సన్మతిజేకురఁజేయ సౌఖ్యసు
శ్రీరమణీయుఁజేయఁ బచ • రించెదు మీకరుణావిశేషమే
కారణమౌనుగాని పెర • కారణముల్ ననుగాచిపంచునే॥

భార— వత్సా! నీవు లోకవ్యవహారమంతగలేమిచే నట్లంటివేకాని పురుషునకు స్వయంకర్తృత్వాధికారముకలదా? సర్వమును ఈశ్వరకృపచేతనే నెఱవేరవలయును. ప్రస్తుతమును నీకీసౌఖ్యవిభూతియు, ముందు రాజ్యవిభూతియు, దైవకృపచేతనే చేకూరును.

సుదర్శ-దేవా! మనస్ఫూర్తిగా నాకీరాజ్యవిభూతియు, నితర విభూతియు భోజ్యములుం గావు. మీసేవచేఁగలుఁగు ముక్తిసాధనములచేఁ గృతార్థుండనగుటయే నామనఃపూర్వాభిప్రాయము.

భార-కుమారా! నీకకాలబుద్ధివొడమినదే! ఇదియెంతయు నసమంజసము. దేశకాలపాత్రానుసారముగా నెప్పటికెయ్యది యవలంబనీయమో దాని నవలంబించుటయే శ్రేయస్కరము. నీవన్ననో వయోవంతుఁడవు. ఋతుధర్మము లనివార్యములు. యౌవనవంతుఁడవౌ నీకు లోకవ్యవహారములయందు రోసిన మావలె ముక్కుమూసుకొనియుంట దుస్సాధ్యము. కాలోచితముగ మనోవ్యాపారములును భేదించుచుండును. కాన నీకిప్పటికి వివాహాద్విభవములు కర్తవ్యములు.

సుదర్శ-వివాహవిషయమనిన నాకదియేలొకో యీర్ష్యాబుద్ధి వొడమెడు. ఒక భార్యచే,

కం. తనయులు సంసారము త
జ్జనిత సుఖాసుఖములు పర • సాధనములకుం
గనఁగా నాటంకములీ
జనులకు భార్యయె విచార • సాగరముగదా! ||

భార-ఇది పిరికిపందలు తలంచవలసినవిధము. లోకవ్యవహారముల కెల్ల నెడఁగ నరణ్యముల వసించి యరిషడ్వర్గముల జయింపనెంచుట ధైర్యవంతుని లక్షణము కాదుసుమీ! ప్రపంచమున మెలఁగుచుఁ దదుద్భూతకష్టసుఖముల సాహసమున నెదుర్కొనుచు జయించినవాఁడే కృతార్థుఁడు. బ్రహ్మచర్య గృహస్థాశ్రమములనుండి క్రమముగ యతీశ్వరుఁడైనవాఁడే జయముఁగాంచును. ఆధార రహితముగఁ బైకెగసినవాఁ డధఃపతితుఁడగుటయే సహజముకదా! గృహస్థాశ్రమము కైవల్యపదమున కొకమెట్టు మఱియు,

మ. జగతిం బుట్టువుఁగాంచినందులకు వత్సా! ధారుణీసౌఖ్యముల్
దగురీతిం గనవచ్చు ధర్మచయముల్ • దాసల్పఁగావచ్చు మె
చ్చుగ మాబోఁటియతీశులం మనుప వచ్చుం ధర్మమార్గంబు ప్రో
క్కఁగ గేస్తుండు సమర్థుఁడన్నిగతులం • గళ్యాణసంధాయియౌ;

ఇంతియగాక

కం. క్రతువులు దానములును సం
తతియుం గృహస్థు • తగుసంతతిచే

గతిగలుగు పితరులకు త
త్సుతుఁడే పావనముచేయు ♦ సూ వంశమ్మున్॥

తక్కిన జన్మములకన్న మానవజన్మము జ్ఞానవంతమై యుత్కృష్టమగుటంజేసి ఋషి దేవ పితౄణములఁ దీర్చుట మనుష్యధర్మము. బ్రహ్మచర్యాది వ్రతముల చే నిదివరకు వేదదాతలగు ఋషి ఋణముం దీర్చితివిగాని యజ్ఞాదికములచే దేవతాఋణమును పుత్రోత్పత్తిచే పితౄణమును గృహస్థాశ్రమ స్వీకారముచేతనే తీర్పవలసియున్నది. అందుచేఁ దరుణవయస్కుఁడవగు నీకు వివాహమే ప్రస్తుతకర్తవ్యము.

సుదర్శ-మానవునకు స్వయంకర్తృత్వములేదని మీరే నుడువుటఁజేసి యీశ్వరకృపచే నెట్లు కానున్నదో యట్లే యగును.

భార—కుమారా ! నీకు సకలశుభము లొడఁగూడుటకునై దేవీమంత్రరాజ మొందుపదేశించెదను. భక్తిశ్రద్ధలతో ననుష్ఠింపుము. సకలాభీష్టంబులుం జేకూరును. (అని చెవిలో నేదియో మంత్రముపదేశించును. సుదర్శనుఁడించుక స్మరించి భక్తిపారవశ్యముతో)

సుద— ఈశ్వరీ! సకల లోకైకజననీ!

సీ॥ సకలపాపవినాశ ♦ చణదీనరక్షణై
కోపాయమగు పాద ♦ యుగళమెట్టిఁగి
భవరోగదావాగ్ని ♦ వర్షసమంబైన
సొబగునీచల్లని ♦ చూపులెట్టిఁగి
జన్మరాహిత్య కృ ♦ చ్ఛణమై ముదముగూర్చు
ననఘమంగళవిగ్ర ♦ హంబెట్టింగి
మాయాంధకార ♦ నిర్మగ్నుల దరిఁజేర్చు
శోభాయమానాంగ ♦ శోభయెట్టిఁగి

గీ॥ యెఱుఁగుటౌకవింతయే భవ ♦ త్సురుచిరప్ర
సాదయోగ్యంబులగుముక్తి ♦ సాధనములు
పూర్ణసంసారజలనిధి ♦ బుద్బుదాయ
మాన మానవతరుణి! శ ♦ ర్వాణి! దేవి॥

(అని ధ్యానించుచుండును.)

(తెరలో)

ఉ॥ కాననసీమడాఁగిన నొ ◆ కానొక మౌనిసమాశ్రయించినన్
నానిసితాసిధారల క ◆ నారతభోజ్యములౌ సుదర్శన
ప్రాణములెట్లుఁబోఁగలుఁగుఁ ◆ బట్టుఁడు కొట్టుఁడు చంపుఁడిప్పుడే
మౌని తనంతనడ్డుపడి ◆ మ్రగ్గగనీయక కాచుచూచెదన్॥

సుద—(అకస్మాద్భయముతో) మునీశ్వరా! అశనిపాతము ననుకరించు నీమేఘగంభీరస్వర మెవ్వరిదో! సుదర్శనుని చంపుఁడని యఱచుచున్నాఁడే?

భార—కుమారా! భీతిల్లకుము. ఇతఁడు మొదటినుండియు నీకపకారము సేయ నెంచు నీతాతగారగు యుధాజిత్తు. ఇతని భావ్యుద్యమ మేమో పరిశీలింతము. కొంచెమిటు తొలఁగియుందము రమ్ము.

[అని వెనుకకుఁ బోవుచున్నారు.]

(యుధాజిత్తు ఒక మంత్రితో ప్రవేశించుచున్నాఁడు.)

యుధా—ఔరా! చిరకాలమునుండి వెదకించియు నీసుదర్శనాధముని నెలవుకనుఁగొనలేకపోయితినే. అందుచేత నేఁగదా? గోటఁజిమ్మవలసినది గొడ్డటఁజిమ్మ నయ్యెను. ఇప్పుడు మాత్రము మించిపోయిన దేమున్నది. వాని నెంతలో సాధింపవలయును. నేఁడే వాని మత్కరవాలమునకు బలిగానిచ్చెదంగాక.

స్రగ్ధర.

నానాదిగ్రాజరాజ । స్ఫుటకటతటమణీ । సవ్యశోభాయమాన
శ్రీనైర్మల్యప్రభాని । స్స్వృతపదయుగళ । శ్రీనిధానుండ నన్నీ
మానుల్ మాన్పొడ్డి సుఖులై । మనఁగలుగుమరే మ్రగ్గనాతండు నాగీ
ర్వాణుల్ వాణీశుఁడును దో । ద్పడినిలచిన దు । ర్వారదోఃప్రౌఢితోడన్॥

ఆసుదర్శనాధముఁడు నేఁటికి నంటయింటికి కుందేలయినాఁడు. వాఁడింకెందుదాఁగునో చూచెదఁగాక. నిర్వక్రపరాక్రమమ్మునచే మద్భుజాబలమ్మునకు బుద్ధిబలమ్ము వన్నెబెట్ట నిశ్శేషిత శత్రుసమూహుండనై యేకచ్ఛత్రాధిపత్యమ్మునఁగ నేలు నాకు నీసుదర్శనుని జీవితము మాత్రమప్పుడప్పుడు గుండెలలో గాలమునఁ గ నుండకపోయెడిదికాదు. ఋణశేష శత్రుశేషాగ్నిశేషము లుంచరాదని కదా పెద్దలు నుడువుదురు. వీఁడిప్పటికి నసహాయుఁడగుటచే నాకేవిధమగు నపకారి కాకున్నను యీతని యునికి నాకపాయకరమే. అందుచే నీతని నామావశేషితుంగాఁ జేసినఁగాని నాకార్యము నెగ్గదు. అప్పటికి నేనొక్కఁడనే సర్వసర్వంసహాచక్రముఁ బరిపాలింపవచ్చును. ఇఁక నిందాలోచనయేలని మంత్రివర్యా! మన పరివారజనుల కిట్లాజ్ఞాపింపుఁడు.

గీ॥ ఆసుదర్శనుని నామ మెం ♦ దైనఁ గనినఁ
బట్టి కొట్టుఁడు నేలకు ♦ బలిమి యొసంగుఁ
డడ్డుపడిరేని యెవరైన ♦ నడఁచివేయుఁ
డమరపతినైన బ్రహ్మ సం ♦ యములనైన ॥

మంత్రి-(స్వగతము) ఔరా! ఇన్నిదినములనుండి బుద్ధిబలముచే రాజ్యతంత్రజ్ఞులను భుజాబలముచేఁ బ్రజలను లోఁగొనిన యీతనికి నేటికిఁ జెడిపోవుకాలము వచ్చినదికాఁబోలు. భారద్వాజునంతటి బ్రహ్మర్షితో వైరమూని యీతఁడు బ్రతుకునా? చేతనైనంత సాయమొనర్చి యీసారికితనిఁ గాపాడి నారాజభక్తిం గాపాడుకొనియెదఁగాక. [ప్రకాశముగా] దేవా! మీరు శత్రువధవిషయిక మాలోచించుట సమంజసమేకాని యీశోకదమాత్రము కేవల మసమంజసము. బుద్ధిమంతుఁడగువాఁడు దేశకాలపాత్రముల నెఱిఁగి సమయానుకూలముగఁ దత్తదుపాయములఁ బ్రయోగించి కార్యసానుకూల్య మొనర్చికొనును. మీరువచ్చిన ప్రదేశమా మహాఋష్యాశ్రమము. ఈమహర్షి తపోమహాత్వముచే జ్ఞానశూన్యములగు పశుపక్ష్యాదులును జన్మజనితములగు సహజవైరములం దిగద్రావి కేవల సాత్వికసంపన్నములై యున్నవి. మనమున్న మనుష్యజన్మమెత్తి యందును నుత్తమక్షత్రియ సంభూతులమై కటికవాఁడుగూడ చేయరాని యసహాయుఁడగు బాలుని జంపఁబ్రయత్నించుచున్నాము. ఇదికొనసాగుట యసాధ్యమనియే నాతలంపు. మీదుమిక్కిలి బ్రహ్మర్షిసత్తముఁడగు నిమ్మహర్షికెగ్గొనర్చి యపాయముగాంచనున్నాము. మీరే యించుక యోజింపుఁడు.

యుధా-ఔరా! అయిన యిప్పుడేమందువు. ఉద్యుక్తుఁడనై వచ్చి చివరకొక ముసలి గోచీబాపనికై వెఱచి నిష్ఫలమనోరథుఁడనై తిరిగిపోదునా? ఈయుధాజిత్తింతమాత్రముననే భీతిఁజెందువాఁడు కాఁడు.

శా॥ భారద్వాజమునీంద్రుఁ డల్గినను గీ ♦ ర్వాణాదులున్ సంయముల్
బీరంబొప్ప సుదర్శనున్ మనుప నో ♦ లిన్ వచ్చినన్ పౌరుష
ప్రారంభోజ్జ్వల దస్మదీయ పటు వి ♦ క్రాంతిస్ఫురత్ఖడ్గ దు
ర్వారజ్వాలల మ్రగ్గకుండ నెటుఁబో ♦ వన్ వచ్చు ధాత్రీస్థలిన్॥

ఎట్లైన నట్లేయగును, నాయానఁదత్క్షణమనుష్ఠేయము.

మంత్రి-దేవా! మీయాజ్ఞ యప్రతిహతమే కాని యించుక నామొరాలింపుఁడు. మఱియు ఋషులమహాత్వము నీవెఱుంగనిదికాదు. ఋషులు శస్త్రసహాయులగుటచే నీకు లొంగుదురనిమాత్ర మెపుడును తలంపకుఁడు.

గీ॥ నీవుశస్త్రాస్త్రిన గొన్నింట ♦ నెగ్గఁగలవు
ఋషు లమోఘవచో శస్త్ర ♦ రీతిఁజేసి
యఖిలజీవుల నొక్కట ♦ నడపఁగలరు
దేవునకు దేవులై పరివ ♦ ర్తింపఁగలరు॥

మదోన్మత్తులై కన్నుమిన్నెఱుంగక బ్రహ్మవిద్వరిష్ఠుల కపకారము సేయనెంచు నీక్షత్రియకులమునకు వారు తగినరీతి నప్పుడప్పుడు బుద్ధిసెప్పుచునేయున్నారు, యెట్లంటిరేని,

సీ॥ ఋషులచే, సేవఁజే । యింపనెంచుటఁ జేసి
యురగమానట్టి న । హుషుఁడొకండు
నిష్కారణక్రోధ । నియతిమై ఋషికప
కృతిఁజేయునా పరీ । క్షితుఁడొకండు
అంధమానికిఁదాను । నపకారమొనరింప
వ్యథఁగన్నదశ । రథుఁడొకండు
దుర్వ్యసనమున మ । త్తుండయి మునిలేళ్ల
నేలఁద్రోచినపాండు । నృపతియొకఁడు
గీ॥ తక్కఁగలిగిన ధరణిపో । త్తంసులెంద
ఱేనిఋషిసత్తములకు దా । రెగ్గుచేసి
చెడరె? వారలకన్న నె । క్కుడగువార
మేమనము? యెటికిసేఁత । లెంచెదధిప!

యుధా-అయిన నిప్పుడు నన్నేమి చేయుమనెదవు?
మంత్రి-కార్యము సామముచే నెగ్గించుకొమ్మనియే నాప్రార్థన.
యుధా- ఎట్లు?
మంత్రి— సుదర్శనునకు నీవు పట్టాభిషేకము గట్టెదననియు ఋషియొద్దనుండి తొలఁగించు కార్యసాఫల్యము నెమ్మదిమీఁద చేసికొనుము.
యుధా- సరియే! వారిని కనుగొందము రమ్ము.

( భారద్వాజ సుదర్శనులు ముందుకు వచ్చుచున్నారు.)

యుధా- (యెదురొక్కని) బ్రహ్మర్షిసత్తమా! నమస్కారము.
ఉ. కొండలఁబోలు వేదముల ♦ కున్ గలపారముఁజూచినావు పే
రుండెడిరీతి నాకభవు ♦ నొద్ద పఠించి పవిత్రచారితం

బొందురచించినావు! మహి ♦ మోన్నతునాగమవేన్యుఁగాన యో
గ్యుండయినావు నీమహిమ ♦ మోమునివర్య! నుతింపశక్యమే?

భార — రాజా! అరణ్యముల ముక్కుమూసికొని చరించుమమ్ములను నిగ్రహానుగ్రహ స
మర్థులగు మీబోటి క్షత్రియులు నుతించుటేటికి? మీకార్యమేమో చెప్పుడు.

యుధా- (సుదర్శనుఁ జూపుచు) దేవా!

ఉ. ఈపసివానితండ్రి గతి ♦ యించుటఁజేసి తదీయవృద్ధికై
దాపునఁజేర్ప నెంచిచనఁ ♦ దత్పురినుండి కుమారుఁడిట్లు రా
నోపినయంతఁజూచియిట ♦ నుండుటఁజేసి ధరాభరమ్మునీ
పాపనిపైనబెట్టి ఋషి ♦ వర్యులసేవయొనర్ప నెంచితిన్॥

ఇన్ని దినములనుండి వెదకించియు నేటిదాఁక నీతనియునికియే కనుఁగొనలేకపోతి
ని. ఇఁక నీతుచ్ఛరాజ్యసుఖములపయి నామనస్సు పోయినది. ఈకుమారు
నకుఁ బట్టముగట్టిన నామనస్సు నిశ్చింతగఁనును అంతమీబోఁటి మహర్షుల
సేవయొనర్చి తరింపఁబ్రయత్నించెదను. ఇదియే నామనోభీష్టము.

భార — రాజా! మీయభీష్టము మాకును సంతోషప్రదమే. అయినను,

ఉ. చిన్నతనంబునుండి నను ♦ సేవయొనర్చుటఁజేసి కొంత వి
ద్యన్నతిఁగాంచినాఁడు తగు ♦ పాటిసుధీమతిఁగాంచినాడు రా
నున్నది వారికిన్ దరుణ ♦ మో జనపాలక! కొద్దిలోన వ
చ్చున్నిజవాటిఁజేరఁ బను ♦ చున్ నినునిచ్చకువచ్చినట్టులన్॥

కానఁ త్వరపడనవసరములేదు. కొలఁదికాలములోనే నిన్నుఁగలసికొనఁగలడు.

(యుధాజిత్తు మంత్రి దిక్కుగను.)

మంత్రి- ఋషిసత్తమా! మాకాసుదర్శనునిరాకయే ప్రతీక్షణీయ మగుటవలన మీయా
నుగ్రహము వచ్చినపుడే త్వరలోఁ బంపుదురా?

భార — సరియే.

యుధా- ఇఁకమాకు సెలవా?

భార — పోవచ్చును.

(యుధాజిత్తు మంత్రితో నిష్క్రమించును.)

సుదర్శ- దేవా! మొట్టమొదట నన్నుఁజంపింపనుంకించియుఁ దుదకు నిష్కారణజాయమా
న కరుణాంతరంగుఁడై నాకుఁబట్టముఁ గట్టవలెననుట నాకతివిచిత్రముగ నున్నదే!

భార—కుమారా! నీవింకను బసివాఁడవగుటచేతను మీదుమిక్కిలి యౌవనమును విద్యా
మోఁదక్క నిద్దఱకు నీమనసింకొకటఁ బ్రసరింపమిచేతను నీవట్లనుచుంటివి.
దీని నిజమువినుము.

ఉ. భావమునందు నొందు పయి ♦ పాటునఁ జెప్పెడి దొందు చేయుకా
ర్యావిధి యొందు పైపయి మ ♦ హామధురమ్ముగ మాటలాడి యే
దోవిధిహానిఁ గూర్తురు య ♦ థోచితకాల మెఱింగి మాటలన్
బైవినయమ్ములన్ గుటిల ♦ భావులు చిత్తము బైలువుత్తురే॥

ఇట్టి మహాక్రూరవిగ్రహుల ననేకుల నిఁకముందు నీవీప్రపంచములో నెదుర్కొ
నవలసియున్నావు. అయినను మంత్రిమహత్వముచే దేవి సాక్షాత్కారము
నొందిన నీకన్నిటజయము లభించి యభీష్టసిద్ధియగును. పోదమురమ్ము.

(అని సుదర్శనుతో నిష్క్రమించును.)

(రంగము. భారద్వాజ ఆశ్రమము.)

(విరహావేశముతో సుదర్శనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఉ. ఏటికినాకు నీముని యి ♦ సీయుపదేశ మొనర్చెమంత్రి మి
శ్లేటికి యల్పకాలమున ♦ నీశ్వరిదాను ప్రసన్నమయ్యెఁ దా
నేటికి రాకొమార్తె వరి ♦ యింపుమటంచునుఁ జూపెఁ జూపెఁ బో
నేటికి చిత్తవృత్తి కల ♦ యింపులనొందెఁ దదేకలీనమై!

నేఁజేసిన యీయల్పకాల ధ్యానమునకే లోకజనని నాయందసమాన కరుణా
ర్ద్రాంతరంగ యేలకావలయు? అక్కటా! సుచియుఁ గాలోచితముగ నొకప్పు
డుచెడుగఁబరిణమించునుగదా! నేఁజేసిన తపస్సెందుకు? దేవీసాక్షాత్కారమెం
దుకు అనపేక్షితమగు నీవరప్రదాన * ( మెందులకు.

కాశీపురమంతయు నేకచ్ఛత్రాధిపత్యమున నేలుచున్న యీసుబాహుని కు
మారియేడ? రాజ్యభ్రష్టతచెంది ఏకాకినై యీ యాశ్రమమున తిరుగులాడు నేనె
డ? ఆముద్దులగుమ్మ నాబోంట్లకు లభ్యమగునా? ఆకాంతాతిలకము నన్నువరిం
చునా? వరింపనియెడల దేవి చెప్పినమాట వృథాయగును కాదె? వృథయెట్లగు?
ఆకన్యారత్నము నన్ను తప్పక వరించు. హాసతీమణీ! రాజ్యములేని రాజును
నన్నువరించి నీవేమి సుఖపడెదవు.

---

* ఇచ్చట కవివ్రాసియుంచిన విషయము రెండుపుటలు చేఁజిక్కక శిథిలములయిన
వి. కావున సంబంధము ననుసరించి కుండలీకరింపఁబడిన భాగమిందు జేర్పఁబ
డినది. ఇందలి "స్త్రీవలపుల్" అను పద్యము కవికృతము.

ఉ. శ్రీవలపుల్ వహించుటన ♦ శ్రీకలుగంగవలె భాగ్యభోగియున్
గానవలె సౌకుమార్యతయు ♦ గానవలె కాననసీమలందు సు
శ్రీవిభవమ్ములేక మునుఁ ♦ జేరుట భోగములన్ద్యజించి సం
భావిత సౌకుమార్యమొక ♦ పట్టునలేని ననన్వరించెదే ॥

(అని కన్నీరుగార్చుచు కూలఁబడుచున్నాడు.)

ప్రవేశము (విదులుఁడను బ్రాహ్మణుఁడు.)

(స్వగతము) ఆహా! ఈయాశ్రమమున నేనెచ్చటు సుదర్శనుని కనుఁగొందును. అన్నిప్రదేశములందును వెదకితిని గాని యాతనిజాడ యొకింతయైన పొడకట్టదయ్యె. ఇదిగో నిచ్చట నివాసయోగ్యమగు నొక పొదరిల్లు కన్పట్టుచున్నది. విశ్రాంతికై యిచ్చటికి వచ్చెనేమో చూచెదను. (అని ముందునకు నడచును) ఎవరుచెపుమా! యీపడియున్న రాకుమారుఁడు. మా రాకుమారి యిచ్చినగుర్తులచే నీతఁడు సుదర్శనుఁడేమో పరికించెద. (అనిపరికించిచూచి) ఈతఁడు నిశ్చయముగ సుదర్శనుఁడే. సందేహములేదు. ఆహా! యేమియీతని సౌందర్యము. కావుననే యీతనియందు, అనురాగమంత గాఢముగ హృదయమున నాటికొనినది. సుదర్శనునితప్ప యింకొకని నక్కాంతాతిలకము వరింపదు. ఆమె సందేశమేకదా నేనిప్పుడిచ్చటికి గొనితెచ్చితిని. వీరిద్దతి వివాహమువలన నీతనికి పురశ్రేయస్సు కలదు. ఈశ్వరీ కృపవలన నీతనికి సర్వశుభములును నచిరకాలములో నొనఁగూడకలవని నామనో నిశ్చయము. ఇఁకఁ గర్తవ్యము పరిశ్రమింతుముగాక. ఆరాకుమారు సమీపించెదను. (అని దగ్గఱుచున్నాఁడు)

సుద — హా! సతీమణీ! [అని నిట్టూర్పు విడచుచున్నాఁడు.]

విదు — [స్వగతము] ఈతఁడును విరహవేదనచే నున్నాఁడే. ఇతఁడు స్మరించు సతీమణి యెవరైయుండును. సందేహమేల? మాశశికళానారీరత్నమే! బాలనాజ్ఞాపించిన దేవి బాలుని మాత్రమాజ్ఞాపింపకుండునా? నేఁడు నాకార్యము నిరాటంకముగా నెఱవేరఁగలదు.

గీ॥ వాడిపోయిననమ్ము ఖా ♦ బ్జమ్ముకలిమి
కళలువాసిన నామోపు ♦ గముల తెలివి
తన్మయత్వమొందిన తను ♦ త్రాణపటిమ
ఇతని విరహమ్ము వేనోళ్ళ ♦ నేస్ప్రహించు॥

[సమీపించి] కుమారా! నీవు సకల కళ్యాణములు కలుఁగుఁగాక.

సుద—(దిగ్గునలేచి) బ్రాహ్మణోత్తమా! ఇదిగో సాష్టాంగముగ నమస్కరించు చున్నాఁడ. (అని నమస్కరించి లేచి)

కం॥ ఏయూరు మీచటికేగెద
రోయుర్వీసురవతంస ♦ యుష్మచ్ఛ్రీమ
చ్ఛ్రీయస్కర దర్శన మహా
హా! యెంతటిపుణ్యలబ్ధ ♦ మయ్యెఁ నాకుఁ॥

విదు—కుమారా! మాది కాశీపురము.

సుద—(ఇంచుక వికాసముతో స్వగతము) నాముద్దులాడి విషయమేమైన నెఱుఁగు నేమో? (ప్రకాశము) దేవా! మీసమాగమనంబునకు గార్యమెద్దియో యెఱిఁగింపవచ్చునా?

విదు—నీకొఱకే.

సుద—భూసురాన్వయతిలకా! మీబోటి సంకల్పసిద్ధులకుఁగూడ దరిద్ర శిఖామణినగు నాతో నేమి పనియుండును? అయిన నెందులకో యానతిచ్చెదరా?

విదు—కుమారా! నిజముగా నీతోఁబనిపడియే వచ్చినాము. యేమందువా?

చం. కలఁడుగదా సుబాహుఁడనఁ ♦ గాఁదగు కాశిపురమ్ము నేలు ను
జ్జ్వలసముదారకీర్తి విల ♦ సద్దిగవాంతరుఁడట్టివాని స
త్కులమునఁ గీర్తనీయఁదన ♦ కుఁ ఘనభావిశుభోదయంబులీ
ల లలితమూర్తిమహా శశిక ♦ ళాతనయామణి ప్రోదిగూర్చెడిఁ॥

సుద—ఆ బాలామణి విషయమిదివఱకే కొంతనాశ్రవణకుహరముల దూఁటినది. ఐన నేమి?

విదు—ఏమందువా? ఆమె యౌవనవతియై వివాహాతరుణవయస్కురాలై యున్నది. కాన రేపు కాక మరుదినమే స్వయంవరము.

సుద—(స్వగతము) అక్కటా! నామనోరథములన్నియు వ్యర్థములయినవే. స్వయంవరమున నన్నాకాంతామణి వరించునా? హృదయమా! త్వరపడకుము. (ప్రకాశముగా) సరియే.

విదు—మీరచటికి కాహూతులుకాఁబడినారు. నేను మిమ్ముగొంపోవుటకే వచ్చినాను.

సుద—స్వయంవరమున నాప్రసక్తియేమున్నది?

విదు—అందరు రాకొమరుల ప్రసక్తి యేమున్నదో నీకును నదియే.

సుద—అన్యరాజన్యులు శ్రీమంతులగుటచే నకాంతాతిలకము వారిని వరించునేమో

యని యోసపమటుచితము. కాని దౌర్భాగ్యశిఖామణినగు నేనట్లు తలంచు
టెట్లుపొసఁగు?

విదు - కుమారా! అట్లుకాదు వినుము. నిన్నే యాసతీమణి వరించినది. యాస్వ
యంవరమున నీవే వరుఁడవు.

సుద - మహాత్మా! ఏటికి పరియాచకము? మహారాజసుతయగు నాసతి జన్మమాత్ర
క్షత్రియుఁడనగు నన్ను వరించునా? యేల యీపొసఁగని ప్రసంగములు.

విదు - కుమారా! నేననృతమాడితినా? నీతో నాకేమి పరియాచకము. అమె
సందేశవాక్యములఁ గూడ చెప్పెద నాకర్ణింపుము.

సుద - దేవా! సావధానుఁడనై యున్నాను.

విదు - ఆబాలామణి నీతో నిట్లుగా విన్నవింపుమన్నది.
" మనోహరా!

సీ॥ త్రికరణశుద్ధిగా, దేవ! నిన్నెవరించి
భవదాగమాకాంక్ష, నవయుదాని
పంచభూతమ్ములు, ప్రబలసాక్ష్యములు గా
నన్ను నెప్పుడుగోర, నట్టిదాని
మూఁడుమూర్తులయాన, నాఁడు నేఁడునుగూడ
నీకునై ప్రాణముల్, నిలుపుదాని
కుసుమసాయకుఁజంపు, కొన్నవట్టుగనీవె
నామనోహరుఁడంచు, బ్రాముదాని

గీ॥ నేగతిని నేలుకుందువో, హృదయహారి!
యేవగించిన ప్రాణముల్, నావిగావు
కరుణఁజేపట్టి యసువులఁ, గాచికొనెదొ
విడచిచంపెదొ? నీచిత్త, వృత్తియనఘ॥

మఱియు,

శా॥ నీకై యేర్పడె నీస్వయంవరము నీ, నిర్వ్యాజకారుణ్యతన్
నాకై యిచ్చుటికేగుదేరగదె కాంతా! నన్ రసాభాసతన్
జేకూర్పంగ నుపేక్షచేయునెడలన్, పృథ్వీశు లీక్షింపఁగా
నీకై రెండవజన్మమెత్తెదనుగా, నీ ప్రాణముల్ దాల్పనా॥ "

కేవి నిజవృత్తాంతమిది— నీవేమిచెప్పెదవు?

సుద - నేనుఁజెప్పుటకేమున్నది? ఐనను నామాటలుగా నా కాంతామణితో నిట్లువచింపుము.

“ బాలామణీ!

శా॥ నాకున్ మెండుగనిండియున్నయవి నీ నవ్యోదయత్సౌఖ్యలీ
లాకాంక్షల్ చిననాటనుండియును బా, లా దైవయత్నంబు లే
జోకల్ గూర్పఁగ నున్నవో మనకు? నీ, శుండింత తోడ్పాటిక
న్నాకుం జేసిన నాఁడు నేఁడనుటలో, నన్ నిచ్చుదర్శించెదన్॥”

విదు - కుమారా! ఇఁక నేఁబోవచ్చునా?

సుద - చిత్తము దేవా! నేను రేపే పయనమైవచ్చెదను.

( నిష్క్రమించుచున్నాఁడు. )





శ్రీ మురకతేశ్వరాయ నమః.

# శశికళాసుదర్శనీయము.



## ద్వితీయాంకము.

రంగము. (కాశీపుర బాహ్యోద్యానము)

ప్రవేశము—శశికళ.

అక్కటా! ఈవిరహభార మెంతని యీదుదును.

మ॥ ప్రసవంబుల్ మణినూత్నభూషణములుల్ ప్రాంచద్విలాసంబులున్
రసికాలాపసఖీజన ప్రముదితా ◆ ర్ధప్రజ్ఞలున్ నేఁడు వె
క్కసమై తోఁచెడు బుద్ధికిన్ సకల సౌ ◆ ఖ్యంబుల్ పెడంబాపునా
కుసుమాస్త్రాయుధుఁ బుష్పబాణములఁ జీ ◆ కుం జెందిగా సిల్లుటల్.

నేటికి మూఁడుదినములకిందట నాచేనంపఁబడిన భూసురోత్తముఁడు మన్మనోహరుఁడిటు నీనాఁడేయే తెంచునని వచించె. ఇంతవఱకు రాఁడయ్యె. స్వయంవర నిర్ణీతదివసము రేపేకదా! అదుగో భాస్కరుఁడు మద్వాగ్రత వాంఛితంబులం బలె పడమటి కొండదాపునకుఁ జేరెను. సర్వ సర్వంసహాపతులు విచ్చేసిరికాని మత్ప్రాణపతి రాఁడుకదా! అయ్యో! ఇంకేది దిక్కు.

శా॥ సందేశార్థము బ్రాహ్మణుండు పతికిన్ ◆ జాటించెనో; లేదో; యా
సందేశమ్ము మనోహరుండు వినియున్ ◆ జ్ఞప్తిన్ బెడంబాసెనో?
సందేహించెనొ నాదు ప్రేముడిని తా ◆ సాహాయ్యశూన్యుండునై
టుండదత్సంగతిమానెనో; యిటులఁగ ◆ ట్టాయెందుచే రాఁడొకో?

బ్రాహ్మణుఁడు నాసందేశమే కొని పోలేదందుమా నాబుద్ధికది కేవలమసమంజసముగాఁ గన్పట్టెడి. నన్నాతఁడు వరించియే యుండఁడను కొందమా దేవీవాక్య

ములు వ్యర్థములగునే? చిరకాలమునుండే స్వప్నమున నాకాశవాణి సాక్షాత్కరించి నన్ను సుదర్శనుఁడిదివరకే వరించియుండెననియు నేనాతని వరించుట సర్వమంగళకరమనియు వచించియుండెఁగదా! అది రిత్తవోవునా? లేక నన్ను వరించియేయున్న నాజీవితేశ్వరుఁడింకను రాకుండునా? వలచిన ప్రాణేశ్వరుఁడు రానిచోఁ జింతలఁ గతియేమి?

ఆ॥ వె॥ పుష్పసదృశమైన పూఁబోఁడి • హృదయమ్ము
జీవితేశు, డెపుడో • చేరున నెడి
తృష్ణబాధమూఁడ • దీపించు నేకాని
లేకయున్న వాడిపోకయున్న॥

ఎటులైనఁ గానిమ్ము. మనోవాక్కాయకర్మముల నెవ్వనిని వరించితినో వాని చేపట్టవలెఁగాక యన్యులపై నాసపడుదునే? ఈరాజలోకంబెల్ల స్వనగరములు చేరిన చెడుదురుగాక. ఎన్నటికైన నాసుదర్శను పాణిగ్రహణముసేయవలె నొండె. జీవితాశవదలవలెనొండె (పవిత్కారముగా) వేయువిధములగా నెన్నటికిని జరుగనేరదు. నాప్రాణేశ్వరు నేనేచేపట్టఁగలను. అదియేమో కాని సుదర్శనుని వరించుటన్న నాకెక్కడలేని యుత్సాహము కలుగును. హృదయము శుభమునే సూచించుచున్నది.

(సంతోషముతో)

ఉ. ఎన్నఁడు జీవితేశ్వరుని • యెన్నికకుం గడు పాత్రురాలనై
మన్ననఁగాంతునో; యెపుడు • మాహృదయేశుని బిగ్గఁగౌఁగిటం
జెన్నలలార్తునో? చెలులు • చేరి ముదంపడ నాథుశీర్షమం
దెన్నఁడు ముత్తియమ్ముల న • భీష్టమతిన్ దలఁబ్రాలఁబోతునో॥

అక్కటా! ముందెన్నఁడో సౌఖ్యములబ్బునని యువ్విళులూరుచు నాకాశసౌధనిర్మాణమొనర్చు నేనెంతబేలను? ప్రస్తుత మీవిరహాగ్నిఁ బయల్పడుటెట్లు? మన్నాథు సందర్శనములేని యీసర్వభోగ్యవస్తువు లరుచికరములుగనే తోఁచుచున్నవికదా! నేను ప్రాణపదముగనెంచి మాటలు నేర్పిన నాశారికా నివహంబున్నదిగూడ బుద్ధిసనదుకదా! యింతేల? సౌఖ్యమునకును నాకును దూరమైనది. ఈ మనోవేదనచే నేనెంత నితపింతు? కటకటా! నాజీవితేశ్వరుఁడే రానియెడ నాకాతని యీచిత్రపటమే ప్రస్తుతదుఃఖాపనయనకారిణి కావలసివచ్చినదికదా! (చిత్రపటముఁ జేఁదీసికొని ముద్దిడికొనుచు) ఆహాహా! ఈయాకృతి యెంతదర్శనీయము.

చ. జిలిబిలిమోముపైఁజిలుకు ♦ చిన్నిదరస్మితముల్ హిమాంశు రే
ఖలఁబ్రభవించు చంద్రికల ♦ కాంతుల బాసటనై చెలంగఁగా
విలసదమేయయౌవనన ♦ వీనవిలాసము లంతకంతకున్
బలుకఁగరానియట్లు గను ♦ పట్టెడు నామదిఁగోర్కెలుబ్బఁగన్॥

ఈమనోహరునిపై నామది రానురానున్మాదావస్థఁగాంచెడి యట్లున్నదికదా! తన్నామ సంస్మరణదక్క తక్కప్రాపంచికవిషయములన్నియు మఱపునకు దగిలినవి. ప్రతిప్రకృతిపదార్థమందును నాసుందరాంగు యాకృతి ప్రతిఫలించుచున్నది. అక్కటా!

సీ॥ కనుపండువొనరింప | గాఁగల్గుమత్కాంతు
దర్శనసౌఖ్యసం | ధానమెపుడు
నిఖిలరాజులలోన | నేనగ్రతముఁడని
యెంచి వానిని వరి | యించుటెప్పుడు
మత్ప్రాణనాథుఁ బ్రే | మమునఁజేరఁగఁదీసి
యంచితమ్ముగఁగౌఁగ | లించుటెపుడు
నాజవ్వనము వ్యర్థ | మై జనకుండంగ
దాంపత్యసౌఖ్యమ్ముఁ | దార్చుటెపుడు?
తే॥ గీ॥ నేను నాసవయస్కుల | లోన శిరము
నెత్తి కోరినవస్తువు హత్తెననుచు
వాంఛితార్థ సంప్రాప్తినై | వరలుటెపుడు?
మోదవారాశిలోన నే | నీదుటెపుడు?

నేఁదలపోయు నీకోరికలును వ్యర్థములే. నేనీప్రాణముల భరించుటయు దుర్భరమే. ఉన్మాదావస్థచెందిన నామనస్సు నిలుపోపనేరదు. హా! హా! అక్కటా! ప్రాణపతీ! సుదర్శనా!

శా॥ భావంబున్ భవదీయదర్శనమహా ♦ భాగ్యంబువాటిల్ల నెం
తోవాత్సల్యముచేతనిల్పి యసురుల్ ♦ దుఃఖమ్ముతోఁబట్టితిన్
రావే! కావవె! యీఁడుదానిమొరలన్ ♦ బాటింపవే ప్రాణదా
నావిర్భూతసుఖంబులఁగొనవె! కాం ♦ తా! సుంతమన్నింపవే॥

ఔరా! యిఁక నేభరింపఁజాల. హా! సుదర్శనా! హా! సుదర్శనా!

(అని మూర్ఛిల్లుచున్నది.)

ప్రవేశము — సుదర్శనుఁడు.

ఔరా! ఆశ యెంతసేయ నేరదు?

ఉ. ఏడమదాశ్రమాంతరమి ♦ వెక్కడ కాశి దరిద్రదేవతా
పీడితుఁడైన నేనెచట ♦ విశ్రుతభూధవవాంఛనీయమా
చేడియ యేడ నేనుపరి ♦ శీలనసేయక తత్స్వయంవర
క్రీడన కేగుదెంచు విప ♦ రీతమిదేడ, తలంచిచూడగన్॥

అక్కటా! నేనెంతమూర్ఖతాశిఖామణిని. సర్వ సర్వంసహాచక్రపరిపాలన ధౌరేయవిభవాఢ్యులగు రాజశిఖామణులచే నాసింపఁబడఁదగిన యాశశికళావనితామణియేడ; రాజ్యములేని రాజును నేనేడ? ఓయాశాపిశాచమా! ప్రొద్దునుండియు కాళ్ళీడ్చుకొని నన్నెంతదూరము లాగికొనివచ్చితివి? అమ్ముద్దులగుమ్మ నాబోంట్లకు లభ్యమగునా? ఇక్కడ నాకుదిక్కెవరు? నన్నాదరించువారెవరు? తిరిగి పోదుమన్న మనసొప్పదు. ఒకవేళ నక్కాంతామణి యాదరించిన నాదరించుఁగాక; ఆవనితారత్నము నన్ను వరింప రాజశిఖామణులోర్తురా? ఓర్వక వారు చేయగలదేమి? (సవితర్కముగా) ఇట్లులేకదా మనుజులు కార్యఫలముల స్వశక్తులతో నార్జింపఁజూతురు. వారెంత వెఱ్ఱివారో కదా! ఈసచరాచర సర్వలోకహేతుభూతమగు నమ్మహాదేవి కరుణయుండ నాకేది దుస్సాధ్యము. సర్వకార్యములు నామెచే నిర్వహింపఁబడు.

ఉ. లోకములన్ సృజింపఁ దన ♦ లోనిమిడింపఁగఁ బెంప నెట్టిలో
కైకశరణ్యకారణము ♦ నా పరిణామముఁ గాంచు నమ్మహా
శ్రీకమనీయపాదసర ♦ సీరుహసేవనలబ్ధవాంఛితా
స్తోకపదుండనై చెలఁగు ♦ దున్ సకలార్థసమంచితుండనై॥

(కొంచెము నడచి ఆకసమువైపుఁజూచి) ఇప్పుడిపుడే యర్ధాస్తమయము గాంచుచున్న యీసూర్యబింబ మెంతదర్శనీయముగ నున్నది?

చం. జగమను ధూమయానపథిఁ * జక్కఁగనొండొక రైలు వేగఁబో
వఁగఁ దుదిస్టేషనైతనరు * పశ్చిమవార్నిధియందు నాఁగఁ బో
ల్పుఁగ దనరారు కాలమను * పోర్టరు పట్టిన యెఱ్ఱదీప మ
ట్లగపడు నేత్రపర్వసము * దంచితభాస్కరబింబమియ్యెడన్॥

మఱియు సంధ్యారాగము లెంతయు వీక్షణీయములై కన్పట్టుచున్నవి.

సీ. చరమాద్రిమేఖ లాం । తర విరాజచ్ఛోణ
తరమహాగైరిక । ధాతువులన
పశ్చిమాధిప వన । ప్రాంచత్పరోవర్ధ
మానకోకనదసం । తానమనఁగ
వరుణపుర కవాట । భాసురపద్మరా
గమణి ప్రభాలస । త్కాంతులనఁగ
పశ్చిమాంబుధిసము । ద్భవబాడబానల
ప్రోజ్వలత్కీలాస । ముజ్వలమన
తే॥ గీ॥ చరమగిరివరిరమమాణ । సురసతీవి
రాజమానగండప్రభా । రాజియనఁగ
కన్నులకు నింపునించివి । కాసమూన్చి
రమ్యమగు నౌర! యీసాంధ్యరాగపటిమ॥

అవిగో కలకలారావములు సేయుచుఁ బక్షులు తమకులాయముల కెంతో మనోహరముగఁ బఱుగిడుచున్నవి.

ఉ. మెల్లఁగఁబక్షి వేగమున ♦ మించి చదల్ గమకింపఁబోవఁగా
నల్లస వేఱొకండగు వి ♦ హంగము మంతనె వేగ ధాటి వ
ర్తిల్లి పరాంజనంగ నిత ♦ రేతరసద్విజయప్రకాంక్షరం
జిల్లెడు, నోఁటఁ ధాన్య మవ ♦ నిం బడకుండగఁ బక్షిదంపతుల్॥

(విలోకించుచు) మఱియు నీపశుగణములు,

మ. చెవులల్లార్చుచుఁ దోకలూపుచు నుదా*సినత్వముంగాంచి ని
ష్టవిధిన్ ధ్యానముసేయు యోగిక్రియఁ బొ*ట్టల్ నింపి చేతోముదో
ద్భవమౌ నిశ్చలభావముంగనుచు నా*త్మాంతర్గతామోద సం
భవ దీవ్యత్ప్రతిభావికాసములు పై*పైఁగన్పడంజేసెడిన్॥

పొద్దుక్రుంకినది. ఇఁక నేనిచటఁ దడవోర్వరాదు. (కొంచెమునడచి) ఇది కాశీపుర బాహ్యోద్యానముగఁ గన్పట్టుచున్నదే. ఇచ్చటకుఁ గాశియనతిదూరములో నుండనోపు. పోయెదఁగాక! (అని ముందునకు నడిచి) కన్నులపండువు సేయునీజగన్మోహనాకారమేమైయుండునో?

సీ॥ కాదంబినీబహి ♦ ర్గత వీక్షణీయసుందరమైన
తొలుకారుమెరుపనంగ,
లోకమ్ములకు సుంద ♦ రాకారమిదియని
పొల్పుఁజూపెడిపైడి ♦ బొమ్మయనఁగ
తనయసమాన వి ♦ ద్యను జిత్రకారుఁడు
వ్రాసిపెట్టిన చిత్ర ♦ పటమనంగ
ధరణీసమాలోక ♦ నరతియే తెంచిన
భాసమానాప్సరో ♦ వనితయనఁగ
తే॥ గీ॥ తనకు శక్తికిజాలు సౌందర్యరాశి,
బ్రోవుచేసి విధాత నేర్పున గడించు
సృష్టికల్పవాచాతురి స్పష్టపడఁగ
వ్రాసిపెట్టిన లక్ష్యంపు వనితయనఁగ॥

కాదు. కాదు దేవకాంతయగునేమో ? ఏమైననేమి ? ఎంతదర్శనీయమగు పదార్థము. చూచి తనివినొందవలదా ? ఆహా ! ఏమి యీదేహ సౌకుమార్యము.

సీ॥ మొదటిమనోహర ♦ పుష్పోదుత్వమేదక
భాసురంబై తగు ♦ పల్లవంబు
మొద్దువారక నిత్య ♦ మున్నవనపలాడి
కనుపండువొనరింప ♦ గల్గుతీవె
వాడిపోవక సౌర ♦ భమ్ముపీడకసము
జ్జ్వలకాంతులీను నిస్తులలతాంత,
మన్యులుభక్షింప ♦ నట్టినిత్యస్వాదు
పరిపక్వరుచిర విస్ఫారఫలము
తే॥ గీ॥ అనితరప్రీతిదాయక ♦ మహారహఃప్ర
చింతనీయపదార్థ వి ♦ శేషకమ్ము
కాంతకాంతము మానసా ♦ కాంతదివ్య
మహాహా ! యీదేహకాంతి నిర్వ్యాజపటిమ॥

ఆహాహా! ఈసుందరాకార మెంతరమణీయము.

ఉ॥ చేరెడునేత్రముల్ చెవులఁ • జేర నిగన్నిగలాడు దేహము
శ్రీరుచులెల్ల కన్నులకుఁ • జెల్వుఘటించిముదంబునింప శృం
గార రసప్రధానమగు • కామినికాయముచూడ్కికింపు సొం
పారఁగఁ జేసెడిన్ మనసు • నందు వచింపఁగరాని కాంక్షతోన్

(ముందునకు నడచి బాగుగాఁ బరిశీలించుచు)

మ॥ అరరే! యీతరుణీతనుద్యుతులు న • య్యారే విలాసమ్ము బా
పురె! సౌభాగ్యసులక్షణమ్ము లవురా • పూబోడి సౌకర్య
మద్దిర! సత్పావనతావిశేషవిల స • ద్దివ్యంబు నిలాటి సుం
దరిలోకమ్మున సుందరాంగులకు నెం • చ లక్ష్యమై యొప్పుదే!

ఈసుందరాంగి యెవ్వతెయైయుండునో? ఇటనేలపడియుండియున్నదో ఇది ప్రమదావనమగుటచే నీపెయంతఃపురకాంతయైయుండునా? అంతఃపురకాంతయేయైనచో సఖీజనమెవ్వరును లేక నిదురించుచుండునా? (విలోకించుచు) ఇది నిద్రించుటయా? కాదు. కాదు. మూర్ఛావస్థయైయుండును. కొంచెము వికాసముతగ్గి కృశించునట్లు కాన్పించుచున్న యిప్పటి యీమె స్థితినిఁబట్టిచూడ మూర్ఛిల్లినట్లితోఁచెడు. ఇందుకు గతమేమై యుండునో? (ఆలోచించుచు) ఎన్నఁడును బరస్త్రీ విముఖమగు నా హృదయము నేఁడెందులకో యిక్కాంతామణిం జూచినదాది పరిపరివిధములఁబోవుచున్నది. ఈసుందరాకృతింజూచిన నే యతీశ్వరుని హృదయము చలింపకుండును?

సీ॥ ఘర్మబిందువులచే • గలుషితంబగునీపె
నెమ్మోముకాంతు లెన్నెన్ని కలవొ
చీకాకు వడిచెల్లఁ • జెదరైనయీపె
పెన్నెరివేణి కాంతు లె • న్నెన్నికలవొ
సగమఱమూయుచుబాష్ప • సంకులంబౌనీపె
కన్నులకాంతు లెన్నెన్నికలవొ
సౌఖ్యమ్ము లేమిఁగృ • శంబైన యీపెపెన్
మెయిననుకాంతు లెన్నెన్నికలవొ

తే॥ గీ॥ సొలసినిట్టూర్పుగాడ్పులు • మలసియాడ
హావభావవిలాసమ్ము లన్నివిడచి

యొక్కచోజడవృత్తి బరుండి నిదుర
నున్న యీపెవిలాసమ్ము • లెన్నన్నికలవో ? ॥

ఈమనోహరాంగి నొకసారి పలుకరించి చూతునా? ఛీ! ఎవరో యెఱుంగక నే నీమెను మోహవృష్టులఁ బలుకరింపఁదగునా? ముందుపోయి చూచెదఁగాక ! (అని దగ్గరకుఁబోయి సంతోషాశ్చర్యములతో) ఏమియీ యాశ్చర్యము!

తే॥ గీ॥ కలయొ? నిక్కవమో? నేను • గన్నరూపు
మనమునందున్నరూపొక్క • మాడ్కిఁదోఁచె
నరయ నేఁగోరురత్న మే • యగు నెయిదియొ?
ఆడఁబోవుతీర్థమె రెుదు • రాజె నహహా!

సీ॥ చిరకాలముననుండి । సేవింప శర్వాణి
నాకుఁ జేకూర్పు పు • ణ్యములరాసి
ప్రాణపదమ్ముగా • నేను మన్నించెడి
భామాకృతిని గన్న • నోముపంట
ఘనయశశ్శ్రీలఁ జే • కొననేను భావించి,
యారసికొనెడి భా • గ్యములప్రోవు
చిరతరానంద సం • సిద్ధినేనుదలంచి,
దాఁచికొన్నట్టిరత్నముల పేటి

తే॥ గీ॥ నామహాసౌఖ్యముల సీమ • నాదుప్రేమ
నాగుణమ్ములరాశి యా • నందరాశి
నాదుసౌభాగ్యలక్ష్మి మా • నసిక దైవ
మహహా! యియ్యది నాప్రాణ • మానెతలఁప॥

నా శుద్ధాంగలక్ష్మి గాఁ జిరకాలమునుండి నేను మన్నింపనెంచిన నాప్రాణమియ్యదియేనా? చిరకాలమునుండి నేనొనర్చు నాదేవీతపఃఫలమిమ్మదియేనా? నాభాగ్యమునెంతని కొనియాడికొనవచ్చును. జన్మాది నేననుభవించిన నిముసములలో నిదియే మత్ప్రథమ సౌఖ్యకరనిమేషము. ఆహాహా! నేత్రములారా! మీర నేటికిక దా జన్మసాఫల్యము నొందితిరి.

ఉ॥ మించినప్రేమ నెవ్వతె స • మీక్షణసేయగనింతదాఁక మీ
రెంచివియోగభారము భ • రించితుదన్ సఫలీకృతార్థలై

మించితిరా సతీమణిన ♦ షేయ ముదమ్మున మీఁకుఁ దృష్టిగాఁ
గాంచితి, రెంతపున్నెమొడి ♦ గట్టితిరో కద! వెన్కపుట్టుకన్ ॥

ఔరా! ఈసుందరీలలామ - యీచంద్రవదన - యీముద్దులగుమ్మ - యీ మురిపెములప్రోవు - కన్నులు కలవారిచేఁ జూడఁబడవలదే? బుద్ధిగలవారిచే వర్ణింపఁబడవలదే? హృదయము కలవారిచే నానందింపఁబడవలదే? ఔరా! నా పూర్వజన్మపుణ్యఫల పరిపాకము. ఇంతనిష్టదరిద్రభాగధేయులకిది విశేష విషయముకాదా! అహోహో! యీశ్వరుని యఘటనఘటనాప్రజ్ఞ! విధాతృని సృష్టినైపుణ్యమంతయు నిందే కనుపఱచినాఁడుకదా!

ఉ॥ చక్కదనంబునందు గుణ ♦ జాలమునందు బవిత్రకాంతి యం
దెక్కడలేని సద్గుణము ♦ లెన్నియు నేనియమర్చి యొక్క చో
సక్కమలాక్షి ధాత సృజి ♦ యించి జగమ్మున కొక్కలక్ష్యముం
జక్కని తన్మహత్త్వమును ♦ జాటె జగం "బదిరా" యనన్ దనన్.

ఇక్కాంతామణి నీక్షించినతోడనే యెంతబుద్ధిహీనునకైనను సౌశీల్యపవిత్రవినయాది సద్గుణంబులెల్ల నీవనితామణియందు నాకృతిఁగాంచినటుల దోఁపఁగలిగి యుండ నేను గ్రహింపలేకుందునా? సవిత్కారముగా ఇంకను నీమెవర్ణింపనెంచు నేనెంతమూర్ఖుఁడను.

చ॥ పసిడికి వన్నెవెట్టుగతి ♦ భాస్కరకాంతికి నిర్మలత్వముం
బొసఁగయతించురీతి నిజ ♦ మూర్ఖతనింద్ర ధనస్సులోన సం
తసముగు వేఱురంగును బొ ♦ దల్పెడుతీరున వెఱ్ఱిగాదె యీ
బిసరుహ పత్రనేత్రనతి ♦ ప్రేమను వర్ణన సేయనెంచుటల్ ॥

(శశికళ ,, హా సుదర్శనా! హా సుదర్శనా! అని పలవరించును.)

సుద — ఇక్కాంతామణి నామీఁది మోహభ్రాంతిచే మూర్ఛిల్లి నన్నుగూర్చి పలవరించుచున్నది కాఁబోలు (సవిత్కారముగా) నేనెంతయాశాపీడితుఁడను. ఔను ఇది మానవసహజము కదా!

ఉ॥ మానవుఁడేవదార్థ మన ♦ మానవుఁ బ్రేముడిఁ దానునిత్యముం
మానసమందు నెంచి మితి ♦ మాలినరీతినిఁ జింతసేయు న
ద్దానినె సర్వవస్తువులఁ ♦ దాఁబరిభావన సేయుచుండు మో
హానలదగ్ధమానసున ♦ కారయ మంచియుఁ జెడ్డలుండునే? ॥

అట్టులే నేనును నాకీ నారీమణియందుగల మమతచే నన్నును నీమె యట్లేప్రే మించియుండునని భావించుచుంటినికాని యించుక సత్యాసత్యవిమర్శనంజేసిన దాఁక హృదయము నిల్పలేకపోతినిగదా! ఐననీమె ముందేమిచేయునో యిచట నేయుండి పరీక్షించెదఁగాక !

(శశికళలేచి మోహావేశముతో సుదర్శనుంజూచి 'జీవితేశ్వరా,' అని కౌగలించుకొనబోవుచున్నది )

సుద—(స్వగతము) ఇప్పటి యీమె మోహావేశమునకు నేనతికాఠిన్యమూనక తప్పదు.
(ప్రకాశముగా) కాంతా!

మ॥ విజనస్థానమునందు నొంటరిగ ను ♦ ద్దీవ్ స్వైరసంచారివై
నజనుల్ గాంతయొకర్తుమోహమున సం ♦ భావించెనన్నంత భూ
ప్రజనిల్ దూరదె? మోహచిత్తులగుచున్ ♦ భామల్ పరుంగోరుచో
నిజమూహింపుము లోకమేమియనునో ♦ నిన్నంబుజాతేక్షణా!

శశికళ- ఔరా! యిదియేమిమాయ? జీవితేశ్వరా! నీవునాకుఁబరుఁడవా?

చ॥ త్రికరణశుద్ధిగా నిను వ ♦ రించి స్వయంవరమందు నీదు రా
కకునయి వాచికంబనిపి ♦ కంటికి నిద్దురలేక నీమహా
ప్రకటిత దర్శనంబునకు ♦ భాస్కరువేఁచెడి చక్రవాకి య
ట్లకట కృశించుచుంటి మఱి ♦ నారయలేరొకొ యింతమాత్రమున్॥

సుద—వనితా! నీవు నన్నువలచితివా? ఇఁకగాంతలకుఁగూడ త్రికరణశుద్ధియు వలపు ను నిపుడు క్రొత్తగ నుద్భవిల్లుచున్నవా? యేమి యీవింత!

మ॥ పులివిశ్వాసమురీతిఁ గాంతలదియే ♦ మో కొంతకాలమ్ము ని
స్తులమౌ ప్రేముడి యెక్కపూరుషునిపై ♦ జూన్పింతు రాలోన చం
చల సారూప్యముకన్నఁ జంచలము లౌ ♦ నారీమణి ప్రేముడుల్
తొలఁగున్ కాంతలబుద్ధియెడ వలపుల్ ♦ లోఁగాంచు రెడన్ భువిన్॥

శశికళ- భూనాథశిరోమణీ! అవి పూరుషులు కాంతలపైఁ దలపోయు పిచ్చియూహ లుగాని నిజముగా నట్లుకాదు. కాంతలకున్న మనోనిశ్చయము పూరుషుల కుఁ గలదా!

చ॥ ఎవనివరించిమానముల ♦ నీయదలంచును కాంత వానికే
తవిలిత్యజించుఁ బ్రాణములు ♦ తద్వ్యతిరేకము సేయఁజాల దీ

భువివరుఁడొల్లఁడేని మఱి ♦ పూరుషులన్నను రాతిగుండెవా
రవుటఁద్యజింపనేర్తురుగ ♦ దా! సతులన్ దమయిచ్చవొప్పఁగన్ ॥

సుద — సుదతీమణీ అదియుఁ వింతకాదు.

ఉ. ఇంతులు పూరుషాళిని వ ♦ రించితిమంచు నపాంగదృష్టులన్
వంతురు, హావభావముల ♦ వారిని జంత్రపు బొమ్మలట్టు లా
డింతురు ప్రేమలేకయు న ♦ టింతురు ప్రేముడిగల్గువార ల
ల్లింతలుసేయ శేరు మది ♦ నెంచినకాంతలు కాంతులన్ భువిన్ ॥

శశి — రాజకులాగ్రగణ్యా! పురుషులెంతవంచకులు.

మ॥ తనకుందానయివచ్చుకాంత నెటులేన్ ♦ దౌష్ట్యంబుమైనొంచి వం
చనసేయం గమకింపఁ బూరుషులకున్ ♦ సాజంబెయౌగాక! ని
న్ననసేలా? మగవార లక్షణము క ♦ ట్టా! యింతకుంగాంతఁ జు
ల్కనగాఁజూచుటెసుమ్మి! యేమనెదమీ ♦ క్రౌర్యప్రవృత్తంబులన్ ॥

ఓ భూనాధశిరోమణీ! ఈమనంగబాధచే నన్నింకెంతని వేఁపెదవు. చిరకాలమునుండి భవద్దర్శనార్థమై చంద్రునికై వేఁచు చకోరముచేత్రి, భాస్కరు నిరీక్షించుఁ జక్రవాకియట్లు మేఘాభిలాషయగు బలాకిరీతి నిరీక్షించి నిరీక్షించి కన్నుల కఱవుదీర నీయాకృతింగాంచియు శ్రోత్రపేయముగ మీమృదుమధుర వాక్యములాలించియు హృదయ సంతుష్టికై వాంఛించి నీదినురాలి మొఱ యొక్కింత యాలకింపరాదా? నాహృదయము నీకు విక్రయించితినన్న విశ్వాసములేదా?

మ. నరనాథాగ్రణి యెంత వేడికొనినన్ ♦ నాపైదయాలేశమున్
జూరఁగానీయదు నీదుమానస మహా ♦ చోద్యమ్ము, లోకమ్మునన్
బురుషుల్ దారకఠినాత్ములే యయిన మీ ♦ బుద్ధిన్ మదిన్ జూడఁగా
తరువో? రాయియొ? వజ్రమో కన నసా ♦ ధ్యంబయ్యెడున్ భూవరా॥

మఱియు నామనోనిశ్చయము వినుము.

సీ॥ పగలురాత్రియునిజ ♦ వ్యాపారమాగ్నులా
చండకరేందులు ♦ సాక్షిగాఁగ
ఆకసమ్మున దళు ♦ క్కనియీశ్వరప్రజ్ఞ
జాటునక్షత్రముల్ ♦ సాక్షిగాఁగ

సర్వకాలమ్ములఁ ♦ జగముఁ బోషించుచు
జరియించు దిక్పతుల్ ♦ సాక్షిగాఁగ
నాకు నానంద సం ♦ ధాయినియై ప్రేమ
నీక్షించు వనలక్ష్మి ♦ సాక్షిగాఁగ
తే॥ గీ॥ సకల తరు గుల్మ పక్షి సం ♦ చయము లెల్ల
జగతిఁ బ్రకృతిపదార్థముల్ ♦ సాక్షిగాఁగ
నిన్నువరియించితి వరించు ♦ చున్నదాన
నెల్లపుడు నిన్నె వరియింతు ♦ నింత యేల॥

త్రిమూర్తుల సాక్షిగా నిన్నే వరించితి. జీవితేశ్వరా! యింకనైన నాపైన నమ్మకము లేదా? నన్ను విసర్జించినచో మీ దాసురాలు మీ కన్నులయెదుట మృతురాలై మిమ్ముఁ జేపట్టుటకే మరలనొక జన్మ మెత్తవలెను. కాన నా కభయహస్త మిమ్ము. నీవు నన్నిపుడు కఠినచిత్తుఁడవై విడనాడిన స్త్రీహత్యాపాతకమునకు కొడగట్టెదవు సుమ్మీ.

(అని కౌఁగిలించుకొనఁ బోవుచున్నది.)

సుద — (దూరముగను తొలఁగి తనలో) అయ్యో; నేనెంత పాపిని!
చ. ననువరియించి నాకయి మ ♦ నమ్ము తిరమ్ముగ నిన్నినాళ్లు ని
ల్పి నిజము నాకునై బ్రతుకు ♦ భీతమృగాక్షిని నిర్దయుండనై
మనమున లేశమేని యను ♦ మానము నొందక ద్రోఁచి పుచ్చు నా
కును నెపుడేని సద్గతులు ♦ కూడునె? ద్రోహికి మేలు కల్గునే॥

యేమన నేనిక్కాలమునకు విధిబద్ధుఁడనై మనఃకాఠిన్యమూనవలసివచ్చినది.
[ప్రకాశముగా]

ఉ. మానము స్త్రీలకుం సొగసు ♦ మానము సొమ్ము ధనమ్ము దాని నే
మానిని పోటఁబుచ్చుఁ గొరఁ ♦ మాలినదయ్యది కీర్తి కాముకుల్
మానవతుల్ చరించునవ ♦ మార్గమె యయ్యది లోకమందు స
మ్మానము కల్గ నున్నె మితి ♦ మాలిన మోహవశాత్ము లేరికేఁ॥

కాన నో మానినీమణీ! దేశకాలపాత్రము లెఱుంగక యిటు మోహభ్రాంతురాలవగుట పాడియా?

శశి — (దుఃఖముతోఁ గన్నీళ్ళు కార్చుచు) ఓపాపిష్ఠిసురలారా! మీరు నన్నిఁకఁ జూసిపొండు.

ఉ. ఎంచఁగరాని ప్రేమమున ♦ నెవ్వరిమానసమందుఁ గోర్కెపే
మించితి రామనోహరుఁడై ♦ మీపయినిర్దయ చిత్తుఁడై విస
ర్జించె నిఁకేమిమీయునికి ♦ చేఁగలలాభము? పొందు మెప్పుడే
నంచితలీల వీఁడెవరు ♦ డాటకు నెమ్మదిఁగోరి ప్రాణముల్॥

(అని పైటకొంగుతో నురివేసుకొనఁ బోవును.)

సుద — [ఆతురతతో] కాంతా! యిదియేమి సాహసము. నేను నిన్ను విసర్జించితినా! విసర్జింపఁగల్గుట నాసాధ్యమా? లేదు. లేదు.

మ. నినుఁ బ్రేమించి సురాదిదిక్పతులు రా ♦ నీ రాజలోకంబు మి
న్నిన శత్రుత్వముచేతఁ బైపడినఁగా ♦ నీయెన్నికష్టంబులే
మినుపైఁబడ్డ విధానవచ్చినను రా ♦ నీ, యెప్పుడేఁ నేవరిం
చినని న్నేవరియింతు నీశ్వరుఁడు సా ♦ క్షీభూతుఁడై యొప్పఁగా॥

తరుణీమణీ! ఇఁకనైన నీవు తత్తఱపడక నాపైఁ బ్రసన్నురాలవు కమ్ము.

మ. కలికీ కాటుకకంటినీరు విడువం ♦ గానేల? దుఃఖాశ్రువుల్
మలినంబున్ బొనరింపవే? భవదమూ * ల్యక్షీర నిష్ట్యూతగం
డలసత్కాంతుల నింకనైన నను గాం * తా! నీదు క్రేఁగంటి చూ
పులధన్యంబొనరింపరాదె? క్షణకో * పుల్ గారొకోయుత్తముల్॥

ఉ. చంపకగంధి యింతలగు * సాహసకృత్యములాతలంప నేఁ
డెంపునఁదెల్పి లేమినియె * దేన్ ఘనదోషమొనర్చియున్నఁగో
పింపఁగఁబాడియే? తగదు * భీరుఁడ నీకిది యంచుప్రేమ మ
న్నింపఁగ బాధ్యతల్ గలుగ * నేరవె? నిన్ జవదాటనేర్తునే॥

కాంతామణీ! నీకవజ్ఞజేసినందుల కీసారి నీబావుని మన్నింపుము. ఇతనికి నీయందు నీకు నాపైనున్న యనురాగముకన్న తక్కువగా లేదు. కాని యీతఁడు విధినిబద్ధుఁడై యున్నవాఁడు. అలుకఁబూనకుము.

శశి — (స్వగతము) ఔరా! ధీరోదాత్తుని లక్షణములివికదా!

చ. ధరణిని బూరుషుండు క్షమకుం * దానె సతీవివశాత్ముడై పొరిం
బొరి పయిపైబడందమక * ముగ్ధ గనుచుందురు కాంతతానె తి
త్తరమున గోరిపిల్వనిటు * తద్వ్యతిరేకము చెప్పిమాన్ప నె
వ్వరితరమిట్టిధీరగుణ * భాస్వరచిత్తులు నేర్తురేగాకిలన్॥

(ప్రకాశముగా) మనోహరా! నాయట్టియల్పచిత్తులు మీబోంట్ల పాణిగ్రహణమునకెట్లర్హలగుదురు. నన్ను క్షమింపుడు.

సీ॥ కనులార మిము గాంచ! గల్గుటెప్పుడోయని
లోచనప్రీతికై । లోగిలోగి
మీకరగ్రహణసం । ప్రీతియెట్లనుచు జి
త్తాసంగమమ్మున । దలచితలచి
మీస్మరణాకాంక్ష । మించి రేబలు ని
ద్రోచ్ఛేదమునకేని । యోర్చియోర్చి
ఆహారమరుచిగా । నగపడుటం జేసి
తనుతాపలమ్మున । గునిసికునిసి

తే॥ గీ॥ విషయనిర్వృతిగాంచి । వేగివేగి
తుదకు నున్మాదమునకేని । దోగిదోగి
నే త్రపానాశమునకేని । నేర్చినేర్చి
మూర్ఛనొందియు మృతిరాద । పూర్వవిధిని॥

సుద - హరిహరీ! పాపముశాంతించునుగాక! జీవితేశ్వరీ! నాహృదయశల్యముగా నెంతకర్ణకఠోరవాక్యముల నాడుచుంటివి? ఇపుడు నాయందుగల కూర్మినెంతలో బెడబాసితివి? నాయెదుటనే యిట్లశ్లీలములాడుచున్నావేల? కాంతామణీ! అచిరకాలములోనే నిన్ జేపట్టగలను? అట్లుగాక నే నిన్నిప్పుడే గాంధర్వముచే జేపట్టితి నేని,

మ. తలిదండ్రుల్ నినుగోపగించినను ను ॥ ద్యద్బాహుశక్తిన్ విరో
ధులు నిర్వంచనజేసినన్ పిదప నే ॥ దోశష్టమే తెంచినన్
లలనా! నేనసహాయుడన్ గద యెటుల్ ॥ గానున్నదో యప్డు నీ
విలసత్కీర్తికి మెలవచ్చుగద; నే ॥ ప్రీతిన్ నినున్ బట్టినన్॥

మఱియుగాంధర్వవివాహముచే నేనిప్పుడుచేపట్టిన స్వయంవరమునకై వచ్చిన
రాజులు నన్నూరక పోనిత్తురా? తొందరపాటుచే బలవద్విరోధమునకుఁ బాల్పడ
వలసియుండును గదా! ఇన్నికారణములచే నిన్నాసమయమునకుఁ గఠిన
వచనములచే నొంచవలసివచ్చెను. క్షమింపుము.

శశి - (సిగ్గుచేఁ దలవంచు చున్నది)

సుద - తే॥ గీ॥ గండుతుమ్మెద బారులు, గట్టినట్లు
సహజముగఁ జూపునీచూపు, చక్కఁదనము
నేఁడు నరచూపుతోనైనఁ, జూడవలదె?
దయకుఁగనునీదు దాసాను, దాసునబల॥

సతీమణీ!

ఉ. ఈ నునుసిగ్గుదొంతరల, కేమిసతీ యిటు రేయిమించె గం
గానికషార్ద్రవాయుకల, నాద్విగుణీకృత శీతచంద్రికా
స్నానవిలాసముల్ సుఖము, నుంబొనగూర్చు విధుండు ప్రాఙ్ది
జ్ఞానితమండలమ్మును గ్ర, మమ్ముగనెక్కెడు చూడుమంగనా?

శశి - (ఆకసము వైపుచూచుచు) రాత్రిచాలకాలము గడచినది. (విలోకించుచు)
వృక్షచ్ఛాయగన్పించెడి నచ్చటచ్చట జాబిల్లివెన్నెలలు,

క. వనలక్ష్మికోర్కెతో గృహ
ము నలికి యందందుమోద, మునముత్తెపు ము
గ్గునుఁ దీర్చుకరణిఁ దోచెడు
కనుపండువు సేయునబ్జ, కౌముదులరరే!

(సిగ్గుతో) ప్రాణేశ్వరా! యిఁక నాకు సెలవిండు. మనయిరువురివివాహవి
షయమున నిదివఱకుఁ దోడ్పడుచున్న శాంకరియే ముందును దోడ్పడుగాక!
(అని నిష్క్రమించుచున్నది.)

సుద - (మోహావేశములో కూలఁబడి) అయ్యో! నేనెంత దౌర్భాగ్యుఁడను. కర
గతమైనఫలమును ద్రోచిపుచ్చితి నే!

సీ. ప్రాణదానమునన, న్నాదరమ్మునఁ గటా
క్షింపవేయన నాల, కింపనైతి.
చేతోహరామనః, ప్రీతిసేయుమటన్న
నింపుగానేఁగాగ, లింపనైతి

తాళజాలనుదయా, దాక్షిణ్యబుద్ధిఁజూ
పింపవేయన నాద రింపనైతి
కన్నీరుఁగార్చుచుఁ గాంతాయటంచు దుః
ఖింపఁగరిసతఁ ద్య, జింపనైతి

తే॥ గీ॥ ఎంత వేడినదయ లేదె, దేమియనిన
యప్పుడేన్ని కృపాబుద్ధి, నరయనైతి
“ కలిమి వచ్చెదనన్న మో, కాలునడ్డు ”
తెలివిమాలినవాఁడనై, తిని కటకట!

ఇప్పుడు నాకన్నులపండువు సేయుచున్న యాసుందరాంగి యెటకుఁబోయెనో; మరల నెప్పుడైన నేత్రోత్సవముగ నేనకాంచనగాత్రం జూడఁగలనా? భాగ్యహీనులకు సులభసాధ్యములగు పదార్థములును దుస్సాధ్యములే యగునుకదా! అక్కటా!

సీ. సిరులీనుసుందర, సరసీరుహమునెక్క
సక్కెమ్ములాడునా, స్యమ్ముదాని
కలకంఠకంఠవా, గ్ఘనమాధురిమము
నవ్వులాడుగళస్వ, నమ్ముదాని
గంపతుమ్మెదబారుల, గాదనిహసియించి
పసఁజూపుకీల్జడ, మిసిమిదాని
రాయంచనడలఁగా, రాదంచుదిద్దఁగా
బోఁడిమికలనడ, యాడుదాని

తే॥ గీ॥ తమ్ములారగ చూపరె యోపి, కమ్ములార!
అళిసమూహములార యో, యంచలార!
మించుమించెడి కాంతుల, మించుదాని
గనపఱచిపుణ్యముంగట్టు, కొనగరాదె?

(పరికించుచు) ఎవ్వరును నాకు జవాబు చెప్పవారలేరే? ఎందుకు చెప్పరుదురు? నాపై మరులుగొల్పి నన్నాసించిన కాంతామణినిఁ బోఁద్రోచిన నిర్భాగ్యుఁడ

నగు నాపై నచేతనపదార్థములకైనఁ బ్రీతికల్గునా? ఛీ! ఛీ! నేనెంత భాగ్యహీనుఁడను?

సీ. చంద్రుఁగప్పెడిమేఘ । జాలమ్ములోయన
ముంగురుల్ మోముపై । ముసుగులాడ
మఱఁడెడలేక గ్రు । మ్మరుతూపులోయన
క్రేగంటిచూపులు । గినిసియాడ
జాబిల్లిలోనుండి । చనుచంద్రికలునాగ
దరహాసచంద్రికల్ । మురువుచూప
తెలియని మఱుఁడు త । త్తఱమునఁగొట్టుగం
టలునాగ నూర్మికా । నాదమెసగ

తే॥ గీ॥ నడుముక్రిందుగ కీల్జడ । నటనమాడ
పొంగుకొర్కెలచేఁ బైఁట । కొంగుజాఱ
"ప్రాణనాయక" యనుచుఁ బై । బడిననాఁడె
సర్వమును దీర్చికొనక భ్రష్టత । వడసితి॥

ఆహాహా! అప్పటప్పటికి నతిశయిల్లు యీమనోవేదన భరించుటెట్లు? ఇంతదనుకనుండియు నా కూరటఁగోల్పిన.

సీ. పైకిచల్లఁగనుండి * కాకగల్గించు బ
యోముఖవిషకుంభ * మైనవిధుఁడు
కన్నులకానంద * కారులయ్యునొకప్డు
కడుదుఃఖముంగూర్చు * కౌముదులును
తనకిష్టమున్న సం * తసమునులేకున్న
గారింపఁగలనందన * మారుతుండు
దంపతులకు మంగ * ళంపు బాటలుపాడి
విరహులవేఁచు సూం॰ దరపికములు

తే॥ గీ॥ మనమునకు నింతదనుక నిం * పొనరఁగూర్చి
యిపుడుజవరాలిపొందిక * నెంచఁజేసి

తత్తఱము పెన్నులాడఁజి * తమ్ముఁగలచు
నార! మనమున ధైర్యమ్ము * నడఁచి యిటుల॥

(నిట్టూర్పు విడచి యాకసము వైపుఁజూచుచు) ఈచందమామనుం జూచుటతోడనే చాలపొద్దుపోయినదని మనమునకు స్ఫురించుచున్నది. మదనోన్మాదపీడితుఁడనై యిచటనే దడవాసర్పరాదు. దేవీసహాయముచే నేనాసతిం జేపట్టెదఁగాక! (లేచి ముందునకు నడచి) శ్రోత్రములు బధిరీకృతమునొందఁ వినంబడు నీభీషణఘోషమేమై యుండునో (విలోకించుచు) స్వచ్ఛజలపూరితమైన యీగంగానది యెంత నేత్రపర్వముగానున్నది.

మ. అవికన్నందువుగాఁ గనంబడెడు తుం * గానోన్యసంఘుట్ట న
శ్రవణచ్ఛేదకఘోరనిస్వన యుతా * భ్రచ్ఛన్నతాబుద్బుదో
ద్భవసీహారపరాగసమ్మిళిత చం * ద్రప్రస్ఫురచ్చంద్రికా
నివహంబై కడుస్వచ్ఛమైతనరు నీ * నిమ్నాపగాతోయముల్॥

దేవీ! గంగాభవానీ!

తే॥ గీ॥ తల్లి! నీదర్శనమున నే * తలఁగిపోవు
నఖిలదోషమ్ములందు * రహర్నిశంబు
నిన్నుఁగొనియాడి, స్నానమ్ము * నెఱపి సేవ
సేయువారిభాగ్యంబేమి * చెప్పవలయు॥

మఱియు వృక్షములచాటుగ నచ్చటచ్చట నాకాశమున కంటుచున్న యీ యున్నత సౌధములంజూడ వారణాసీపురముం జేరితినని తోఁచుచున్నది.

సీ. జగముఁబుట్టింప బెం * పగ, దృంపగల్గు వి
శ్వేశ్వరునకుఁ గూర్చు * టిపట్టు
మనుల కెల్లర కన్న * మునుఁబెట్టిపోషించు
నన్నపూర్ణాదేవి * యాటపట్టు
దక్షయాగధ్వంస * దక్షుఁడౌ వీరుఁడౌ
వీరభద్రుఁడు గార * వించుచోటు
ప్రమథగణాదిదేవతల * కధ్యక్షుఁడౌ
భయిరవస్వామి పా * ల్వారుస్థలము

తే॥ గీ॥ కలుషహారిణియైన గం * గాభవాని
కునికిపట్టు వేదవ్యాస * ముని నివాస
మును సమీక్షింప భాగ్యంబుఁ * గనఁగలితి
పావన క్షేత్రములరాశి * వారణాశి॥

ఇఁక నేఁ ద్వరగా నేగదఁగాక! (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ద్వితీయాంకము ముగిసెను.





# శశికళాసుదర్శనీయము.



## తృతీయాంకము.

### 1:— రంగము.

( ప్రవేశము చారుడు. )

చారు— (ఒంటరిగా) అబ్బబ్బా! ఎంతకష్ట మెంతకష్టమైనదయ్యా! ఈమహారాజుగారివద్ద జేరిననాటినుండియు నేనెన్నఁడింతకష్టముఁ జేసి యెఱుఁగ. ఈనాటికీ స్వయంవరమునాపస కనుఁగొనుటకే యేర్పడినట్లున్నది. ఎందరు రాజులు. ఎందరురాజులు.

ఉ॥ " మాళవచోళమద్రవర। మాగధవంగ కళింగ సింధు బం
గాళకురూశలాటకురు। కాశ మరాటవరాటగౌళ నే
పాళ విదర్భ బర్బర నృ। పాల కుమారకు" లెంద రెందరో
చాలుగవచ్చినారిట య। సాధ్యులు రేపుస్వయంవరంబుకున్ ॥

వీరిమాటయటుంచి తక్కినవారిని లెక్కిడుటకు శక్యముగాకున్నది. నేలయీనినట్లు యొక్కరివెంట యొక్కరు చీమలుబారులు తీరినట్లుగ వచ్చుచున్నారు. జగమున ఛప్పన్న యేబదియారు దేశములేగదా యున్నది. ఇందరెక్కడనుండి బయలుదేరినారో ?

ఉ॥ ఎన్నఁడెఱుంగనట్టి నృపు। లెందఱో లెక్కిడఁజాలకుండగా
సన్నుత సద్గుణాకలిత। స్వాంతులు దీరపరాక్రమాది సం
పన్నులు సర్వలోకనుత। భద్రయశస్కులు వీరిలోన పే
రెన్నికగాంచనట్టి ధర। ణీశుడొకండునులేడు జూడగన్ ॥

ఇట్టివారికందఱికి వేర్వేఱ వారి వారి కనుకూలంబులగు విడుదల నేర్పఱచి శృంగారించి పనిపాటులకు వలయు పరిచారికల నియమించి " నామర్యాద కాపాడు

మా" యని చెప్పిన రాజాజ్ఞను బూని "అబ్బబ్బా! నిన్నటినుండియు నిప్పటివఱకు నన్నపానీయములు వర్జించి నిలచినచోట నిలువక ఎవరెట్టివానిని యాజ్ఞాపింతు రో" యని పరుగులిడుచుండుటబట్టి సర్వశ్రేయముగానే యున్నదిగాని నాకష్టమునకుమాత్రము మేరలేకున్నది. అది సేవకులకందఱికి సర్వసాధారణమే గదా?

చ॥ పరులకు దేహమమ్ముకొన । బాల్పడువారలకెందుగాని దు
ర్భరమగు కష్టకార్యముల । భారము గల్గుటెగాక సౌఖ్యసం
భరితములైన సర్వసదు । పాయములెల్ల లభింపబోవు నే
ర్పరినని గర్వమొందెడు య । పార పరాక్రమశాలికేనియున్ !

అక్కటా! లోకంబున కొందఱు పిత్రార్జితములగు విత్తంబుల వేనవేలు లంచపంచములక్రింది వెచ్చించి సేవకావృత్తిని బడయుటకు పాటులాడుచుండెదరు. దైవమా! నాస్వానుభవమునుబట్టి నిజముగా నన్నుఁ జంపవచ్చెడు శత్రునకైనను సేవకావృత్తి లభించగోరనుసుమా! ఎంతెంత ధనమును సంపాదించ గలిగినను యెన్నెన్ని హోదాలు లభించినను సేవకుడైనవాడు తనకు వేతనమొసంగువాని కనుసన్నలంగదా మెలంగవలయు. వానికి స్వాతంత్ర్య మెక్కడ జిక్కును?

సీ॥ పెండ్లిపీటల బడి । వేష్టించియున్నను
యజమానునియాజ్ఞకు । నణగవలయు
శ్రాద్ధాదికర్మల । సంధిగ్ధముందైన
పనియున్నదనిపిల్వ । బారవలయు
మంచంబులో బడి । మ్రగ్గుచుండినగాని
పిలువనంపిన వెళ్లి । పలుకవలయు
ఆలుబిడ్డలబాసి । యగ్నిలో జొరమన్న
సంశయింపగదాన । జనగలయు

గాని మారాడినంతనే । గలుగుస్వామి
ద్రోహమెంతయు నద్దాన । దురితమగును
జేయుమొదలిడ నంతంబు । జెప్పరాదు
గాన సేవకవృత్తియే । కష్టతరము॥

కాబట్టియే పెద్దలు

గీ॥ అష్టకష్టంబులందొక్క । టైన నీచ
సేవకావృత్తికాసించు । చెనటివారి
జన్మమేమని జెప్పంగ । సాహసింతు
బ్రతికిచచ్చినవారపో । వసుధమీద॥

అని వక్కాణించిరి. అక్కటా! ఏమితెలిసి యేమిప్రయోజనము. ఎట్లును నానియమిత కార్యమేమో చేయకతప్పదు. ఇప్పటికి కొంతవఱకు ముగించితి గదా యను ధైర్యముం జెందుచుంటిని గాని యావగింజలో యరభాగమయిన గాలేదు. ఇంక నీస్వయంవర సభామంటపమలంకరించు యవసిష్టముగూడ తీరెనా కొంతవరకు గట్టెక్కినట్టే. వట్టి ధర్మోపన్యాసములకుజిక్కి కాలమువ్యర్థా బుచ్చనేల? అబ్బా! ఏమిచేసి యేమిప్రయోజనము నేనెంతగా వళ్లువిరచుకొని కీర్తికొరకు ప్రయాసపడినను నాకష్టము ఫలితమువను పదుగురు సంతసించునట్లు మాత్రము దోచదు. వేడుకగా జరుగవలసిన పెండ్లి వివాదములతో నంతమొందునట్లు దోచుచున్నది. ఏమన్న:—

ఉ. కాంతసుదర్శనాహ్వయుని । గాక తదన్యుల గోరనంచు దా
బంతముతో స్వయంవర స । భాస్థలి కేగనా రాజలోకముఃౕ
గాంతు నెయించు పంతమును । గట్టిగబట్టినదంట రేపు యీ
వింతవివాహమే గరణి । వెల్లగనున్నదో దోచదేమియుఃౕ॥

అటుశశికళా మహాతల్లి సుదర్శనుని సేవరించిన పోరుదప్పదని తక్కిన రాజులలో కొందరు బీరంబులాడుచున్నారట. ఏది యెట్లుకొనసాగునో తెలియరాదుగదా? పోనీ ఆసుదర్శనునిపయి యింత భ్రాంతియేలనో వాని స్థితిగతులం జూచెదమన్న

ఉ॥ బూనియుధాజిదాహ్వయుడు । పోరున జంపగవాని తండ్రినిన్
గానలసీమ జేరి పలు । గాకి విధంబున దల్లితోడ స
న్మానకుగూడ లేకను ది । నంబొక యేడుగ వెళ్లబుచ్చుచుఃౕ
హీనతనున్న వాడనుచు । నేవినియుంటి సుదర్శనుండహో!

ఉత్తమ రాజలోకంబున మిగుల పొగడ్తగాంచి సకలభాగ్య సమేతులగు రాజులెందరోయుండ నిర్భాగ్యుని గోరుటకీమెబుద్ధి పెడతల బట్టినదాయేమి? కాక సుందరుడని గోరెనందమా.

ఉ॥ అందముజూచుటఃౕ వలచెనందమ? వానినెఱుంగ దెన్న డీ
సుందరి; పోవనిమ్ము? పెర । శూత్తులకుఃౕ భ్రమజెంది యిప్పుడీ

చందముబూనెనన్న । కొన సాగునె? కూడునుగూడలేనిచో
యందము తిందురో ధరణి । నర్ధముతిందురో జూడదాసుగా॥

పాపమా బాలకీ దుర్బోధన నెవరు బోధించిరోగాని యవివేకమనసునాటి యుంటు యొవరెన్నిరీతుల దెల్పినను ఫలితముగానరాకున్నదిగాని తల్లిదండ్రులుమాత్రము కీర్త్యాపకీర్తులను భరింపవలసినవారగుట విడువక వెంటబడి సామదానభేదదండోపాయంబుల స్వయంవరమునకు రమ్మని బోధించుచున్నారట. పర్యవసానమెట్లుగాగలదో ఎటులయిన నాకేమి. ఈకాలంబున గోడకు చెవులుండునండ్రు ఈగోడవలు నాకేలగాని నేనింతనాటినుండియు నీరాజస్థానంబునందుండినవాడగుటచే యొవరెవరిబుద్ధుల నెరుగుదు. శశికళమాత్రము పట్టినది కంకరపట్టేసుమీ? ఎట్లును సుదర్శనుని వరింపకమానదు. పోరుపాసగక మానరు. ఎట్లుజరిగినను నాకార్యము నేను చేయకతప్పదు. త్వరితముగానేని కొంతవఱకైన సభామంటపమలంకరింతుగాక. (నిష్క్రమించుచున్నాడు.)

(ఇది శుద్ధవిష్కంభము.)

## 2. రంగము.

కాశికాపురిలోని యంతఃపురము.

(ప్రవేశము చంద్రవదన.)

చంద్ర- అక్కటా! మాశశికళ వెర్రిభ్రాంతి కేమనవలయును. లేక లేక గలిగిన యేక పుత్రికయగుట వైవాహికాది కార్యములనెన్నెన్నియో వేడుకలతో జరుపుకొన ముచ్చటపడుచుండ మాయాశలన్నియు గగనకుసుమంబుల ఛాతినిరర్థకంబులై చనుటయేగాక చివరకు చివరకు ప్రాణములపైకిగూడ వచ్చునట్లున్నది. కన్నకడుపగుటు ఖండితంబుగ దండించిచెప్పి మాయిష్టానుసారంబుగ నొనర్పజాలక సామంబున నెందరమెన్ని ప్రయత్నంబులజేసినను మాయత్నములన్నియు బూదిని జేయు నాహుతి చందంబు నిష్ఫలంబులయ్యె. సమయము దాపరించె. ఏమి చేయుటకు దోపదు. అక్కటా! ఆసుదర్శనుండెక్కడ దాపరించెనో? వాని వృత్తాంత మీమెకెవరుదెల్పి మాకొంపకింత వెసరుబోసిరోగాని తెలియరాదు. అయ్యయో! ఆమె పరితాపమునకు మేరలేకున్నదిగదా.

సీ॥ చందనంబననగ్ని । చందంబుగానెంచు
బూలమాలిక నెంచు । భుజగమట్లు
పూసెజ్జకత్తుల । బోనుగా చింతించు
వెన్నెలసరసించు । వేడియనుచు

గీ॥ తాడికంబన్న । భీతిని వెతలొందు
హర్మ్యంబు యమకూపమనుచు జడియు
అన్నపానీయముల । మన్నుగావిడనాడు
పికనాదముల । మృత్యువిధముదలచు
గీ॥ విహారము సేయుట । యన్ననో విషముమ్రింగు
టనుచుదలపోయు । ఉద్యానవనములన్న
గారడవులట్లు దలపోసి । కాలుపెట్ట
వెఱచుచుండును । శశికళ వెఱ్ఱిబుద్ధి ॥

జ్యో. యోచించనిందు వింతయేమున్నది. కామాయత్తచిత్తులకు యుక్తాయుక్త విచారణ తెలియునా? అదిసహజమేకదా!

మ॥ అనురాగంబన కన్నుగానదు మనం । బామిట్టపల్లంబులన్
గనకెచ్చోటికినైన నేగునిక వే । డ్కల్ మంచియుం జెడ్డయుం
మునుపేనేరవు; మన్మథుండు చపలా । త్ముండెంతయుం మూర్ఖుడం
చనలం" వేచుచునుండుగా నహితవా । క్యంబుల్ ఫలంబిచ్చునే॥

కాదుగాని తానుమాత్రిముతనముందు రాబోవు విపత్తులంగూర్చి యోచింపవలదా? ఎంతవలపుండిన నేమి? దేహమెఱుగని శివమును మనసెరుగని నిద్రియు నానోపునే? తనకుం దెలియకున్న హితులవాక్యములైన నారయవలదా? ఈమూర్ఖమెందుకు వచ్చినదబ్బా! గ్రహచారము నెత్తికెక్కి తాండవమాడుచుండ పరులవాక్యములెట్లు పనికివచ్చును. కావున్న,

ఉ॥ భూతలమందునుండ నృప । పుంగవులెందరొ శౌర్యధైర్య ప్ర
ఖ్యాతులు వారిలోనొకని । నైననుగోరక రాజ్యహీనుడౌ
నాతనినేవరించి యన । యంబు మనోవ్యథనొందుచుండెగా
యీతరుణీలలామ; విన । నెంతయు వింతగ దోచుచుండెడిం ॥

అబ్బా! ఇదియేమి విపరీతకాలమోగాని తల్లితండ్రులమాటలుగూడ పనికిరాక తాము మునిగినదే గంగయటంచు యెంత నిర్భయముగ ప్రవర్తిల్లుచున్నారు. కాలమిట్లుండగ దాయుని యెఱింగియు శశికళమార్గము దిలకించి ముందు వెనుకల నరయక తొందరపడి స్వయంవరమును చాటంబనిచి యీరాజులనందరి నాహ్వానపరచియున్నాడు. వచ్చినవారు ముచ్చటదీర వేడుకల దిలకించిపోవక

నిచ్చటి సంగతి సందర్భములగనిపెట్టి సుదర్శనుని వరించిన మారాష్ట్రమును గగ్గోలు పరచెదమనుచున్నారట. అక్కటా ! దైవమా ! మాకెంతచిక్కు తెచ్చి పెట్టితివి.

[ ప్రవేశము—మాలతి. ]

చంద్రి— చెలీ ! వచ్చితివా ? ఏమయ్యె. మనయత్నము లేమైన ఫలితమునకు వచ్చెనా?

మాల—అమ్మా ! యేమయినదని నన్నడుగనేల ? ఆరునెలలు వాయించిన మద్దెల యోటిదా గట్టిదా యని యడిగినట్లున్నది.

చంద్రి—ఐన శశికళ మామాట నిరాకరించినట్లేగా ?

మాల—ఇంకను సందేహమా ? ప్రత్యక్షముగ, బహిరంగముగ, నిర్భయముగ.

చంద్రి— మాలతీ ! కానున్న కార్యములను యందలి నష్టకష్టంబులను స్పష్టంబుగా నెఱింగించితివా?

మాల—వకసారిగాదు. పదిసార్లు విన్నవించితిని. బ్రతిమాలితిని. కాళ్ళబడితిని. పంతముమాని స్వయంవరంబున నీయిష్టమువచ్చిన వారినే వరింపుమని వచించితిని. కాని బ్రతిమాల బ్రతిమాల బిఱ్ఱబిగిసి క్రొత్తమాదిరి బయలు దేరినది.

చంద్రి—చెలీ ! మఱియధికమేమి?

మాల—అంతయు నధికమే. ఇదివరలో స్వయంవరమంటపముననే యాసుదర్శనుని చెట్టబట్టెదనని వచింపుచుండె. నేడు నాసభామంటపమునకు గూడ రానను చున్నది. పతివ్రత పురుషుల కన్నెత్తియైన జూడగూడదట. పరులనుగాంచి వారివారి గుణగతంబులెఱింగి ధనబలవంతుని చెట్టబట్టుట వెలయాలితనమట. అట్లని పెక్కునిదర్శనములు జూపుచున్నది. సామాన్యరాలా ? మేము బదులుచెప్పలేకపోతిమి.

చంద్ర:—సుదర్శనుండు నిర్ధనుండనియు, యరణ్యవాసియనియు, రాజ్యహీనుండనియు నెఱుంగునా?

మాల:—ఏమో?

చంద్ర:—పోనీ. నీవైన నెఱింగించితివా?

మాల:—ఆ. చెప్పితి.

చంద్ర:—ఏమనియో?

మాల:—అందు కామె యిట్లనియె.

మ॥ "ధనముల్ కాల్పనే? రాజ్యసంపదలు కాం * తారంబునన్ జేర్పనే
గానమందంబును చాతురీగరిమయున్ * గూలంకషప్రజ్ఞ యె

వ్వనికిన్ జొప్పడువాని గోరదగున * వ్వాడెన్నగా నాసుద
ర్శను"డొక్కండగుసుమ్ము ధాత్రిగలరా * జశ్రేణిలో మానినీ॥

అని—

చంద్రి:—చెలీ! ఇంతటిస్థిరబుద్ధిగలుగుతు కాతని యీబాల యేమెరుంగును.

మాల:—ఏమో! చెప్పజాలనుగాని కర్ణాకర్ణిగా వినియున్నారము. ఆలకింపుడుం.

ఉ. "అంబకుభర్తుడంట సుగు * ణాన్వితుడంట దయార్ద్రుడంట యా
యంబయె వాన్రిగైకొనగ * నానతియిచ్చెనటంట గాన వా
నిం బతిగాగ్రహించుటను * నిక్కముగా భువియందు నెట్టిదుః
ఖంబులులేక సౌఖ్యములె * గల్గునటంచు యెఱుంగ దెల్పెగా!

చంద్ర:—తన్వీ! తనకుగుం దెట్టికష్టములంలేక సౌఖ్యములే గలుగుట యదార్థమేయని యీ దేవివచించినదే నిక్కమనియు నమ్మిన యిప్పుడు యీఘోరవిపత్తులు గల్గనుండుటకేమందువు?

మాల:—ఏమోనమ్మా! నాకేమి తెలుసును. వెఱ్ఱికి వెయ్యావిధములుగదా?

చంద్రి:—అల్లుడు దొరకుటయు నత్తమామల నడవినిద్రొక్కుటయు తటస్థించునుగాబోలు? అబ్బా! ఎట్టిసంకటము.

మాల:—అమ్మా! విచారింపకుము. గ్రహబలమెట్లున్న నట్లు కాగలదు.

(తెరలో) దేవా! ఇటు ఇటు,

మాల:—అమ్మా! రాజుగారు వచ్చుచున్నారు.

( ప్రవేశము—సుబాహువు. )

చంద్రి:—ప్రాణేశ్వరా! వందనములు.

సుబా:—తన్వీ! కార్యమేమయ్యె?

ఉ॥ చెప్పగనైనబోధనల * జేసితివే? సుకుమారగాత్రి యే
తిప్పలులేక ప్రేమగిని * దెల్పెడి నీహితబోధకక్కటా!
యొప్పెనె? యొప్పియేమనెనో? * యేర్పడజెప్పుము సంశయింపకీ
విప్పుడు నాకు సర్వమును * యింతి! వినంగకుతూహలంబగున్.

చంద్రి:—ఏమిచెప్పుట కేమున్నది? నయభయంబుల నెంతయో బోధించితిమిగాని మాయుపదేశములన్నియునిరర్థకములయ్యె.

సుబా:—అట్లైన కాంతామణీ! మనకింతయే ప్రాప్తమా? అకటా! ఒకదెస పరికించి లేక లేక కన్నముద్దుబిడ్డను ఏడ్పుపఱచి మడ్డితనంబున దుఃఖపెట్ట మనసొప్పకున్నది. మరియొకదెస దిలకించ నిప్పటిస్వయంవరాహూతులైన రాజపుంగవుల ప్రగల్భములు విన నెక్కడలేని యిక్కట్టులు ప్రాప్తమగునేమో యని భయంబున కుమారిని నిర్బంధించ బుద్ధిపోడమకున్నది.

చ॥ ఒకదెసజూడబావి మఱి - యొక్కదెసన్ దిలకించగోయిగా
నకను మనంబునం దమిత - మైనవిచారము బాదుకొంట నా
కిక నెటుబోవగాదగునొకో - యేమియుదోచక సర్వముక్కగనన్
వికలముజేయుచుండెను వి - వేకము శూన్యముగాగమానినీ.

చ॥ వలదు సుదర్శనాహ్వయుని - పై మమకారమటంచు జెప్పినన్
జలజసుగంధి పీడదు, యు - సాధ్యులు యీనరపుంగవుల్ వడిన్
పలుకుప్రగల్భవాక్యముల్ వినిన - భ్రాంతిభయంబులు గల్గుచుండె నే
కలనుదరింపగాగలమొ - గన్పడదీవిపదబ్ధి యక్కటా!

చంద్ర- ప్రాణేశ్వరా! అట్టులని ధైర్యము వీటబుచ్చదగునా? కష్టసుఖంబు లొక్కటిగా దలపోసి సమభావంబున ముందువెనుకలరసి శక్తినో యుక్తినో కార్యము సాధించుకొనజూడవలయును గాని యూరక విచారపడి లాభమేమి? ఇట్టిసీతులు మీకుపదేశించునంతటిదాననా? ఐనను మీకు నాయందుగల యనురాగంబు పెంపున నింత వచింపుచుంటి.

సుబా:—సరే! కాంతా! నన్నిపుడేమిచేయమందువో కర్తవ్య మెరింగించుము.

చంద్రి:— ఆడుదానిని నాకేమితెలుసునుగాని కన్నకడుపుగనుక కుమారిక మనసునొవ్వకుండునట్లు ప్రవర్తింప వేడుచున్నాను.

సుబా:—ఐన సుదర్శనునకే యొసంగమందువా? సరే. అట్లేచేసెదను గాని,

ఉ॥ వచ్చిరిపెక్కుమంది నృపవర్యులు నేటిస్వయంవరంబుకై
వచ్చినవారి పొమ్మనుట పాడియె? కాదటుచెప్పినంతనే
హెచ్చుగ క్రౌర్యమెంతొ? మనకేదియొ హానిఘటింత్రునందుచే
కచ్చకుమూలమౌను చిర-కాలము నిందరితోడ నక్కటా!

అంతియగాక సభాస్థలిసామాన్య స్వయంవరంబుల చందంబున మాను దమయంతి పోలిక నాబాల కిష్టమగు వరునివరించిన నేకదనమువిదితమని యీనృప

పుంగవులు కొందరు వినికిడిజేయుచుండ మనమిప్పుడు కృత్రిమమేమైన యొనర్చితిమా వీరలపరిభవించినట్లగుగదా? అందుచే వీరికి మనపై నీర్ష్యజనింపదా? అట్టిచో మనము చేయునదేమున్నది?

చంద్రి — నాథా! నాపలుకొక్కటియాలకింపుడు. అఖండభుజబలోద్దీపితప్రతాపశాలురని సకలభూమండలమున మితిలేని కీర్తిసంపాదించి చతురంబోధిపరీతధారణీవలయ భూచక్రంబెల్ల నవక్రమలీల పరిపాలించు చక్రవర్తులరై నేడు స్వాంతంబున చింతిల్లుట జూడ వింతగనున్నది. ఒక్కవేళ మీరననట్లు నృపాలురెల్లరు యొక్కటియై మనకెక్కడలేని యిక్కట్టులు దెత్తురనియా మీ యాలోచన. అంతగవచ్చిన నేమిసేయుదము. వచ్చిన రానిమ్ము.

ఉ॥ సైన్యములేదె? వారు రణశాస్త్రవదూరులుగారె యట్టిచో
దైన్యముబూని మీరిటు వృథాభుజశక్తిని వీటబుచ్చి మీ
కన్యకకుఁ మనోవ్యథను కల్పనజేయగ జూతురొక్కొ సా
మాన్యులరీతి రాజ్యసుఖసంపదలన్నియు వారివేగదా॥

అంతియగాక నకారణకలహము లు ప్రాప్తించునంటివిగా? రానున్నకష్టములు మనము వలదనిన రాకమానునే?

గీ॥ దైవలిఖితంబుచొప్పున దాకుచుండ
కష్టసుఖములు వలదన్న గలుగకున్నె
యెచటదాగిన యెచ్చట కేగియున్న
ధాతకైనను నలవాని తాతకైన॥

సుబా — కాంతా! నీయూహలెఱుంగగల్గితి. బాగున్నది. కానియొక్కటివిచారింపుము.

ఉ. 'రమ్ము స్వయంవరంబను'చు * రాజులకెల్లను లేఖలంపి యా
త్రమ్మున నేడు క్రమ్మర * వృథాజనుడంచువచించునట్టి నీ
చమ్మునకంటెహైన్యము ని * జంబున ధారుణి వేఱెయున్నదే
సమ్మతిమాటదెల్పుము వి * చారణజేసికురంగలోచనా.

చంద్ర — హృదయేశ్వరా! కంపగదలించిన కంచయంతయు గదలినట్లు తీసినకొలదివి యోచనలకు దరుగుండునా? కాని స్వయంవరంబున నే వరించుగాక! అప్పుడుమాత్రము తక్కినరాజలోకమునకు కష్టముగానుండదా? అందున మీ

రేమిచేయనున్నారో తెలుపుడు. అంతమాత్రమున భయముచే నందరికిని కప్పి బిడ్డనిత్తుమా?

సుబా:- కాంతా! నీయుక్తి యంతసహేతుకముగాలేదు. ఐనను కాదననుగాని నీయిష్టప్రకారమే సుదర్శనునికిచ్చి వివాహమొనరించెద. ఏమిప్రయోజనము?

చంద్రి:—ఏల?

సుబా:—కాంతా! ఎంతభ్రాంతి?

ఉ. వానినెఱుంగకీవిటుల * బల్కెదవంతియెగాక జూడుమా
బూనియుధాజిదాహ్వయుఁడు * పోరునజంపగ వానితండ్రినిన్
గానక వేరుదారిబ్రతు * కంగను తల్లినివెంటగొంచుఁ దా
గానలజేరినాఁడు పలు * కష్టముఁలొందుచు దిక్కులేకయున్.

ఉ. అట్టుల కాననాంతరము * లందువసించుచు మౌనిపల్లెలన్
బట్టుక బిచ్చమెత్తుక ల * వంబులభించిన గంజితోడ దా
నెట్టులొ కాలమున్గడుప * నెంచినవానికి పిల్లనిత్తురే
యెట్టిదురాత్ములౌ జనకు * లేనియు ధాత్రిదలంపనక్కటా!

మంచియల్లుడు దొరకవలెననియు ధనధాన్యసమృద్ధితోడ వారు సుఖముగా జీవించుచుంటజూచి సంతోషించవలెననియు గోరుదురుగాని కట్టునఁబట్టలేక యుండను కొంపలేక కాననసీమల యలోలక్ష్మణా యని యల్లాడువానికి కెచ్చటనైన యెఱిగియుండి పిల్లనివ్వ సమ్మతింతురే? అట్టిదుఃఖసౌఖ్యములభాగము నావలె నీవును యనుభవించవలసినదానవుగా నుండి నిట్లాడుట వింతగానున్నది.

చంద్ర:—నిజము. ప్రాణేశ్వరా! నిజము. వారనినట్లు బిడ్డలయొక్కసుఖదుఃఖముల కు తల్లిదండ్రులే కర్తలనుట స్థిరమే. ఐన యొక్కటి యోచింపుడు. లక్ష్మి చంచలమైనదని మీకెరిగినవిషయమేగదా? అట్టిచంచలమైనదానిని పరిపాటించి మనమాబాలను నొప్పింప మనసుపుట్టకున్నది. నిన్నమొన్నటిదాక యాసుదర్శనుండును యీరాజచంద్రులవలె రాజ్యసుఖంబు లనుభవించినవాడేగదా! వానికి కాలవిపరీతమగుటచేగదా యిప్పుడీదశవచ్చినది. ఈరాజన్యులుమాత్ర మంతగాదా! కపటనాటకసూత్రధారుండను భగవంతునిచర్రిత మతివిచిత్రము. లక్షాధికారి భిక్షాధికారిగను భిక్షాధికారి లక్షాధికారిగనుక్షణములో మార్చుచుండును. గనుక యేదియైనను వారివారి పూర్వజన్మసుకృతానుయోగంబున పరిణమించునుగాని మనుజయత్నములవల్ల ఫలితమేమి?

చూడుడు.

క॥ నలువ లిఖించిన వ్రాతను
ఎలదప్పి జరింపశక్య * మే దలపోయన్
నలురాణి కర్మవశమున
బలుబాముల నొందలేద * పతివిడిపోవన్.

సుబా:—కాంతా! నాయర్ధాంగివగుట నాకు గలిగెడుకష్టసుఖము లన్నిటియందును పాలిభాగస్వామివగు నీకే యిట్టివిరక్తియుండ నేనుమాత్రము కాదందునా?

చంద్ర:—అని చేయునదిమాత్ర మేమిగలదు? ఎటులను చిక్కులలోబడితిమి. కానున్నది కాకమానునా! గాని యెట్టికష్టంబులకైన నోర్చికొందము. మీకు స్పష్టముగా కుమారికమనసు నొప్పించ నిష్టము లేకున్నచో యెట్టులనేని మీయిష్టానుసారముగ ప్రవర్తింపుడు.

సుబా:—నాకును నట్లేయున్నది. ఐనను శశికళతో మరియొకసారి చెప్పిజూతము. వినునేమో—

చంద్ర:—నేనుమాత్రము వలదందునా? చెలీ! మాలతీ! నీవేగి మహారాజుగారియాజ్ఞయైనదని శశికళ నిందు దోడ్కొనివచ్చెదవా?

మాల:—అమ్మా! నిరభ్యంతరముగ క్షణములో గొనివత్తు.

(నిష్క్రమించును.)

సుబా:—తన్వీ! చూచితివా? ప్రేమానుబంధమెంత చెడ్డదియో—

చ॥ తలపగ నీదుధర్మమున ♦ ధర్మము మంచియు చెడ్డయున్ వృధా
తలపులముంచికాని పెర ♦ దారులదొ్రక్కగ జేసి పాడుచే
తలకు మనంబుసిల్పు స్థిర ♦ దంబగుకీర్తినణంచు నిట్టివా
తలకు నిజంబుపుట్టినిలు ♦ ధారుణి ప్రేమగనంగ చోద్యమౌ.

(శశికళ ప్రవేశము)

శశి:—జననీజనకులారా! మీయిష్టానుసారంబుగ ప్రవర్తిల్లనందులకు శత్రువుగా మీరెంచుచుండిన మీముద్దుకుమారి శశికళ యిదే వందనమాచరించుచున్నది.

సుబా:—అమ్మా! మేమన్యథా జెప్పుచుండుటలేదు. నీవే యోగుబాగుల పూర్ణముగా విచారించుము. నీమనసునకయిష్టముగా జెప్పుచున్నామనిమాత్రము మాపై కినుకబూనకుము. యెఱిగియెఱిగి కష్టములను బొందజూచు వెఱ్ఱివారుందురే? ఇప్పటినీస్థితియు నట్టిదేసుమా? నీవు కోరినసుదర్శనుండు,

## తృతీయాంకము.

చ॥ వనముల కందమూలఫల ♦ భక్షణుడల్పుడు బిచ్చగా[illegible]
ర్ధనుడు కృశుండు రాజ్యబల ♦ దర్పవిహీనుడు; అట్టివాని నే
మని మదిగోరినావో తన ♦ యా! తగదమ్మ సుఖమ్మునొం[illegible]
మనమున గోరితేని విను ♦ మా! మదివీడు సుదర్శనాఖ్యునిన్.

మేమెందులకో జెప్పుచుంటిమని నీవన్యథా తలంపకుము. [illegible]
ని పెట్టవలసినవారము మేమగుట నీకింతగా వచింపవలసివచ్చె.

ఉ. అట్టియశోవిహీనునకు ♦ నంగనవై సతతంబు కానలో
నెట్టన యొండవానలకు ♦ నిల్వగ నేరక వేళపట్టునన్
బొట్టకుబువ్వలేక సుఖ ♦ మున్ బెడబాసిన నిన్నుగాంచి మే
మెట్టులనిల్వగాగలము ♦ యేర్పడ జెప్పుము నీవె నెమ్మదిన్.

శశి:—తండ్రీ! అమ్మగారివలె మీకును నిదియేటిభ్రాంతి?

చ॥ ధనములు లేవటంచు బల ♦ దర్పము చాలదటంచు జెప్పగా
ఘనమొకో? అట్టివెల్ల కల ♦ కాలమునుండెడివేమి చెప్పుమా
పనిబడి నొక్కరీతిగ బ్ర ♦ పంచమెయుండనివానిబోలె నా
కునుదగ జెప్పబూనితిరి ♦ కోవిదులయ్యును తండ్రి[illegible].

కావున త్రికరణశుద్ధిగా జెప్పుచుంటిని. పదే[illegible] నన్ను బాధింపక నా[illegible]
రివాక్యము లాలింపుడు.

"క॥ మచ్చిత్తభిత్తి భగవతి
విచ్చలవిడి వ్రాసె వాని ♦ విధమంతయు నా
నచ్చినవాడతడొక్కడ
"పొచ్చము లేదందు గూర్మి ♦ పొసగ నీతనికై"

మఱియు,

"క॥ శర్యాతివచనమున మున్
నార్యసుకన్యాభిదాన * చ్యవనునిగోని న
ట్లార్యావచనమ్మున శుభ
చర్య సుదర్శను వరింతు * సత్యవ్రతనై"

అంతియెగాని నా మన మన్యథా జరిగించ నిచ్ఛగింపదు. మఱియు,

చ॥ వనమున నుండుగాక మరి । పట్టణమందు వసించుగాక ని
ర్ధనుడగుగాక మేటిధన । ధాన్యములం దులదూగుగాక నా
మనసలవానిదక్క పెర । మానిసినొల్లదు ధాతయైన ఫా
లనిహితమైన వ్రాతలకు । లాతిగతుల్ పొసగంగ నేర్చునే.

అయ్యో! కుమారీ! కుడిచి కూర్చుండి తన్నుగట్టి దారిద్ర్య దానే తెచ్చుకొనున ట్లు యెంతటిమూర్ఖము బట్టితివి. ఆశలన్నియు నీమీదబెట్టుకొని నీవే సర్వ స్వముగా నెన్నుకొనుచున్న మాకేల తీరనిమనోవ్యథ గల్పింపజూచుచుంటివి?

శశి — తండ్రీ! మీయంతట మీరే మనోవ్యథనొందుచుంటిరో నేగల్పించుచుంటినో పూర్ణమనంబున నాలోచింపుడు.

క. రాజ్యము లేదనుచును మఱి
పూజ్యుడుగాదంచు వినగ * బోలని పలుకుల్
వాజ్యములాడుచునుంటిరి
పూజ్యుని దూషింపుచుండి • పుణ్యవతంసా.

తండ్రీ! పతివ్రత తనభర్తనుదక్క పరపురుషునను మనసునందు నెంచుటకర్హ మగునే? అట్టినీతుల నెఱింగియుండియు నాచిత్తవృత్తిఁ దెలుప బోధింపుచుండి మీరుమిక్కిలి నేనే బాధించుచుంటిననుచుంటిరా? జననీజనకులారా! కలనైన ను మిమ్ము దుఃఖపెట్ట నాకు మనసులేదు. మీరెన్నిచెప్పినను భగవతి నాకు విధించినప్రకారముగానే నాసుదర్శనునితప్ప నితరుల వరింపఁ గోరను. మీరును పుత్రికాభిప్రాయము దీర్ప దలపెదరేని నామాటను మఱుమాట చెప్పక వేగమే నన్నా సుదర్శనునకిచ్చి వివాహంబు గావింపుడు. అతఁడు తనరాజ్యహీనుడైనగదా మీయభిప్రాయము. ఐన నేమాయెను? ఇప్పుడు రాజచ్యుతినున్నవాడు రేపు రా జ్యప్రాప్తి గాంచగూడదా? ఇప్పుడు రాజైనవాడు రేపు తిరిపెమెత్తగూడ దా? కాలానుసరణము నెవ్వరెఱుంగుదురు. అందున లక్ష్మి చంచలమైనది. ఒక్కనికడనే నిలుకడగా నుండునని చెప్పగలమా? కావుననే పెద్దలు కలిమిలే ములు కావడికుండలని దృఢీకరించియున్నారు. అట్టిచంచలమైన ధనమును కాం క్షించి యొక్కసారి నామనసార గోరియున్నవాని వీడి పెరవానిని వరించుమని నుడువుటకన్న తల్లిదండ్రులకు భావ్యమగునా? ధనమును గాంచి భ్రమించు టకు నేను వెలకాంతననుకొంటిరా? అయ్యయ్యో! ఎంతమాట బలికితిరి. ఇంక యేలజనకా? నానుదుటివ్రాత యెట్లగునో నట్లు కాగలదు. అంతియె వ్రాసి

లేకముగా మన మెన్ని ప్రయత్నములు ఒనరించినను కొనసాగవు. కాక యీ లోకంబున దుఃఖము లనుభవించు ప్రాప్తి యుండెనా యేలాగైన ననుభవించె దను. లేకుండెనా మీరు రాజాధిరాజును నన్నొసంగినను నా కా భాగ్యముల ని ఫలము అనుభవింపనేరను.

సుబా—కుమారీ! అట్లని మనసు కుదుర్చుకొనిన గోరుచుట్టుపై రోకటిపోటు చందమున మరియొక గండము తటస్థముగుచున్నది. దానికేమందువు.

శశి—జనకా! అదియెయ్యది.

సుబా:—క॥ "వినుము సుదర్శను గోరిన
ఘనుడు యుధాజిత్తు వాని । గడతేర్చి క్షణం
బున నిన్ను నన్ను నీజన
నినిగూడ వధించుసుమ్మ । నిశ్చయమమ్మా.

అంతియగాక,

ఉ॥ "ఆమ్మరో! యీసుదర్శనుని । కన్న బలాఢ్యులు రూపవంతులున్
సొమ్ములుగల్గువారలును । జూడగ వేలకొలంది వచ్చిర
ద్దమ్మను బ్రాణమానములు । దక్కవికాతని గోరితేని మా
యమ్మ వినంగదమ్మ" యిదు । మమ్మ సుదర్శనుమీది భ్రాంతియున్.

కాక నీవుపట్టిన కుందేటికి మూడేకాళ్ళనునట్లు మూర్ఖము వహించిన యిందరి రాజన్యులతో నేక కాలంబున విరోధంబు సంభవించు. వీరందరు పూర్ణముగా యుధాజిత్తుబోధనలన్ జిక్కి యుక్కుమిగిలి మిక్కుటంబుగ ప్రగల్భంబు లాడుచున్నారు. వీరలమాటలం దలంచిన నాగుండె యవియుచున్నది. కావున,

తరల. "అలసుదర్శను తమ్ముడున్ గడు । నందగాడు మహాబలుం
డలఘుడాతడు శత్రుజిత్తు ధ । రాధిపత్యముగల్గు వా
డెలనాం నీకనుకూలుడెంతయు । నింతిరో వరియించి మా
కులము గోత్రము నిల్పజూడుమ । కోర్కెలెల్ల ఫలింపగన్."

శశి—తండ్రీ! అట్లే మీయిష్టానుసారంబుగ సుదర్శనుని వీడి శత్రుజిత్తును వరించిన గక్కిన రాజలోకం బూరకుండునే? అంతయునుగాక వకవేళ సుదర్శనుడే దైవాజ్ఞ కొందరినిగూడి మిమ్మెదిరించినప్పు డేమిసేయుదురు? ఎప్పటికైన నేనొక్క నిని వరించెదను. గాని కోపమువచ్చినవారి నెల్ల వారికోపమణంచ గలవా నుగదా ?

సుబా — అమ్మా! నీయూహ లంతకంతకు గర్భనిర్భేదకములై మారు జెప్పజాలకున్న
వి. ఐన నే నొక్కటి జెప్పెద నాలింపుము. ఏమంటివేని —

శా॥ అమ్మా! కన్గొనుమమ్మ! రాజసుతుల ♦ త్కాంతోన్నతుల్ మేటిరా
పమ్మందున్ మదనుల్ యశోన్వితులతి ♦ ప్రాభవుల్ నినున్ గైకొన
న్నెమ్మిన్నేడిట వచ్చియుండి రొకరున్ ♦ నీకిష్టమావాని పే
ర్కొమ్మా రూపవయఃకులోన్నతికలా ♦ కలాలంకారాలంకృతున్.

అందుకు రేపే స్వయంవరమహోత్సవము నిర్ణయింపబడినది.

శశి — తండ్రీ! రానురాను మీయూహ లెంతగనున్నవి. కులకాంతకిది యెక్కడ
నైన సరియగునే?

ఉ॥ "కాముకులున్మదుల్ శఠులు క ♦ ల్మషచిత్తులు పాతకుల్ జగ
త్స్వాములు వీరియగ్రమున ♦ సాధ్వులు వర్తిలరాదు సాధ్వియా
భామిని భర్తదక్క నొరు ♦ బారగ చూడగరా" దటంచు వి
ద్యామహితుల్ వచింపవిని ధ ♦ ర్మవిరుద్ధమొనర్ప నేర్తునే॥

మఱియు నొక్కటి యాలోచింపుడు,

క॥ "పలువుర ♦ దృగ్విషయంబై
కులకన్యక చనినదాని ♦ కొరకెల్లరును
దలపోయుదు ♦ రెల్లిదముగు
వెలపాలతుక భంగి ♦ దాని విభవంబెల్లన్॥"

సుబా — పట్టీ! వట్టిమాటలేల! నీపై భ్రాంతి వారలకున్నంతమాత్రమున నీవు వారి
సొమ్మైతివా? అంతమాత్రంబున వెలయాలి చందంబెట్లగును. గనుక స్వయంవ
రమంటపమున నీయిష్టమువచ్చినవాని గైకొమ్మా.

శశి — తండ్రీ!

ఉ॥ "మాలిక చేతబూని తగు ♦ మ్రాన్పనిభంగి స్వయంవరస్థలం
బే లలితాంగి ద్రొక్కినది యే వెలభామిని వేఱయున్నదే
బాలుగనున్న యా నృపతి సంఘములో చొరబార నాకునుం
బోలునె తండ్రి! యేను వెలబోటినె? యిప్పని నాచరింపగన్॥

మిమ్ము సమాధానపఱుప నెంతగఁ బ్రయత్నించుచున్నను ఫలితము లేకపోగా కంచెకదలించిన డొంకయంతయు కదలినట్లుగా మఱిమఱియూహలుమాకుఁగలుగు చున్నవి. ఇంకను మీకెదురాడనోప. గనుక నాకడసారివాక్యము లాలించి నాకుశైలవోసంగుఁడు. నానొసట నెట్లుగా వ్రాసియున్న నట్లుగాఁగలదు. నామానసము సుదర్శనునితక్క దక్కొరుల కన్నెత్తియైన జూడఁగోరదు. ఒక వేళ మీరు నిర్బంధపెట్టినను,

మ॥ వనధుల్ వట్టిన భూమి వ్రక్కలయినన్ భాస్వంతుడస్తాద్రి చల
మ్ముఁన నావిర్భవమందినన్ శశికుహూస్ఫూరిన్ బ్రవర్తిల్లినన్
విను మేనల్ల సుదర్శనున్ విడిచి పృథ్వీనాథు వేరొక్కనిన్
గనముట్టన్ వినబేర్కొనన్ మనమునన్ గాంక్షింపముమ్మాటికిన్॥

కావున మీరందఱు సమ్ముఖమ్మున నన్నాతనికిచ్చి వివాహంబు గావింపుఁడు. లేకున్న మీశశికళ మీకు లేదని తలంపుఁడు.

క॥ కసిదీరగ మీకెంతయు
నసిధారా వ్రతముబూని నగ్నినురికెదన్
విసమున్ మెసలెదఁగాకను
విషమాంబకుడైన నొల్ల వేయేమిటికిన్॥

సుబా—తల్లీ! నీవిట్టులట్టుపట్టిన స్వయంవరమనినాచేనాహూయమానులైనయారాజలోకంబున కేమిచెప్పువాడను. స్వయంవరమనిగదా వీరల బిలిచితి. ఇప్పుడు సామాన్యవివాహముగావించిన వీరూరకుందురా? ఇందఱితో విరోధము నాకు తగునా?

చ॥ పలువురితో విరోధమది బ్రహ్మకునైన దరంబుగాదు నా
పలుకు గణించుపంతమును బట్టకు మెవ్వరికైన సాహసం
బలవడదన్ని కార్యములయందును "వెఱ్ఱియడంగె రోకలిన్
దలకునుజుట్టు మంచను విధమ్మున బల్కెదురమ్మ పుత్రికా?"

శ—తండ్రీ! మీరు భ్రమపడుచుంటిరిగాని నావెఱ్ఱియేమియు లేదు.

సుబా—లేకున్న నేనొకటి జెప్పెద. దానికైన సమ్మతించి నాకు యశంబుగూర్పుమా. అది నీకంత కష్టములోనిది గాదు. ఏమన్న మున్నుసీతావివాహమ్మున జనకుంబలె బణంబేర్పరుతు. అట్లైన నిర్వివాదంబుగా నీజెప్పిన సుదర్శనుఁడేగాని మఱియొకఁడుగాని నిన్నుంగైకొను. అప్పుడు నాచిక్కు సర్వముదీరు. మనకందఱకు శుభంబగు.

శశి—అయ్యో! మంచిమాట సెలవిచ్చితిరిగాని యొక్కటి యోచింపుడు.

ఉ॥ ఈవు పణంబు నేర్పరచి ♦ తేనిథనాంగనరీతి నేనునుం
గావలె వీరికిం సమము ♦ గావశనై; యొకడెవ్వడో ననున్
జేవగలాడొ? వేఱొకడొ? ♦ చేకొనునప్పుడు మాత్రమెల్లరుం
భూవిభులూరకుందురె? సము ♦ ద్ధతులెంతురె? ధర్మపద్ధతుల్॥

కావున యేవిధమునను కలహముదప్పదు. అంతమాత్రమునకు నన్ను వ్రతభంగము జేయ బొల్పడుట తగునా? సమర్థుండైన గాకున్న నాకు సుదర్శనుండుదక్క యన్యుండు భర్తగానోపను. కావున దీనికి నేనొక్కటి నుడివెద. వినున్న—

చ॥ "వినుమునృపాల నామనవి ♦ వీరలకుంమది జంకదేని న
న్ననువుగ నాసుదర్శనున ♦ కర్పణజేసి రథమ్మునందు మ
మ్మునిచి మహోత్సవంబలర ♦ నూరికినావల విమ్వ మట్లొన
ర్చిన నెదిరించు శత్రులను హరింప ♦ గఃగాడతడాహవమ్మునన్"॥

అట్లుగాక నాతడు వారలచే ముడసిన నాకును వానితోడిదే లోకము గాక. ఇందులకు నీరాజన్యులగాంచి నిట్లనుము. "నేటిదినంబున కీసభ జాలింతమెల్లిన నీకార్యంబునెల్ల సమర్థించెద నిది నిక్కవమని యవ్వారినివిడుదుల కంపించి యీరేయి గుప్తంబుగ నాతని రావించి విధివిధానంబుగ నన్నునర్పింపుము. మీద నాతండు నన్ను తనరథంబునందునిడికొని పోవనేర్చు. రాజులూ సంగరోన్ముఖులై దుర్మదమ్మున నడ్డుపడిరేని యస్మదుపాసితయగు శక్తియ నివారించుగాక. కాదేని సుదర్శనునితోడి లోకంబు మీకును చేకూరు. మీరన్యథా పరివర్తించిన నన్ను బ్రతిమాలిన యిల్లిదే మీపాదంబులచెంత రజ్జువుచే ప్రాణంబులుబాసెద. (నిష్క్రమించును.)

సుబా—ప్రాణేశ్వరీ! నీవైనను కూతుమనసు మరల్పమునకు ప్రయత్నింతువా?

చంద్ర—నాథా! నేను చాలప్రయత్నించియే చూచితినిగదా. నిష్ఫలంబయ్యె. దాని మనోరథమే చెల్లింపరాదా.

సుబా—అయ్యో గ్రహచారం బెంతకు వచ్చె. దైవఘటన మెట్లున్నదో తెలియరాదు. అడకత్తిలోని పోకచందంబున కడునిడుముల జిక్కుకొంటి. యేమిసేయుటకు దోపదు. కానిమ్ము. కుమారి వచించిన చందంబుననే బరివర్తించెదను. ఇంక పోవుదమురమ్ము. (నిష్క్రమించుచున్నారు)

తృతీయాంకము

సంపూర్ణము.



# శశికళా సుదర్శనీయము.



## చతుర్థాంకము.

### స్వయంవర మంటపము.

మాళవేశ్వరుడు:—(జనాంతికముగ) యుధాజిత్తుమహారాజా! నేడు స్వయంవరమని యీ కాశీపురాధీశ్వరుడు మనల నందరి నాహ్వానము చేయవచ్చితిని. నిర్ణయించి మనకెరుకపరచినలగ్నమా మించిపోవుచున్నది. తద్వివాహయుక్తసన్నాహము లేమియు నింతవరకు కనుపించవు. చూడచూడ నిది కేవలము కృత్రిమస్వయంవరముగా గన్పించుచున్నది. నీయభిప్రాయమేమి?

యుధాజిత్తు:—అవును. నాకు నట్లే బోధగట్టుచున్నది. స్వయంవరమను పేరిడి మనల నవమానపరచవలెనని యీకాశీనాథుడు కంకణము కట్టుకొని యీపన్నుగడ పన్నినట్లున్నదిసుమీ? లేకున్న నీవు చెప్పినట్లు భేరీమృదంగాదివాద్యఘోషములుగాని నృత్యగాన కళావినోద కాలక్షేపములుగాని మంత్రగీతపఠనాదివంబులుగాని పురశృంగార మలంకారముగాని లేకయుండునా? స్వయంవర మహోత్సవమేమి? ఇట్లుండుటేమి? కానిమ్ము. మనమెంచినట్లీసుబాహు డలంచిన మనమంత తెలివితక్కువవారమా? తానింక బ్రతుకగలడా? ఇందరు రాజచంద్రుల నగౌరవపరచిన రాజు మరల పుడమిపై నుండగలడా? ఇంక కొంత నిదానించి చూతము.

మాళ:—చూచుటకేమున్నది. ఊరిసౌందర్యము గోడలే చెప్పుననుసామెత నెరుంగవా? మీ రేమైన ననుడు. ఈరాజు మనలనందర నేదియో కపటప్రయుక్తినినిందు రప్పించియుండబోలును గాని స్వయంవరము మాట మాత్రము నిశ్చయముగాదు. ఇప్పుడిట్లు నీళ్లునములుచూ రిత్తయోచనల జిక్కి మిన్నకుండిన మానహానియైన పిదప యోచించిన లాభముండదు. తాను చేయదలచినపనిని జేసినతరువాత మనము వాని నేమిచేసి యేమిప్రయోజనముండును. ఫలానివానిచేత నవమానింపబడితిమను నీయపయశంబు మనకుండకపోవునా? అట్టి అపయశ్శను బొంది నెత్తిపై

గుడ్డవేసుకొని మరలుటకంటె మున్ముందుగ నేతత్ప్రతీకారమునుగూర్చి చింతించిన బాగుండును.

యుక్తా — ఔను! నీయూహ సమంజసముగానే యున్నదిగాని ఇంకను లగ్నమువేళ సమీపించినదిగాదు, వచ్చినరాజులుకూడ సభాభవనము నలంకరించియుండ లేదు. వక్కరొక్కరుగ వచ్చుచున్నారు. అందరిని రానిమ్ము. వచ్చినతరువాత మనమందరముగాని కొందరముగాని కలిసి యోచించి తత్ప్రతీకారమును గూర్చి చింతించుదము.

( ప్రవేశము శూరసేనుడు—— కేరళాధిపతి )

కేరళాధిపతి:—అబ్బా! ఏమి యీశశికళ చక్కదనము. కేవల రాకాచంద్రబింబమును ధిక్కరించు నీశశాంకవదన నెవరిని చేపట్టునోగదా? ఈయిందీవరాక్షిని బడయు రాజుదే జన్మమగుగాక! తక్కినవారిదొకజన్మమే? ఈసుదతీమణి బడయుదుననుయాశ నాకావంతయు లేదుగాని సభామంటపమున నొక్కసారి కన్నులారైన గాంచి యానందించుమని యెంచి వచ్చియుంటిని. వచ్చినప్పటి నుండియు నిచ్చటిసంగతులు బహుచిత్రముగా నున్నవి. స్వయంవరమే జరుగ దనియు, ఘోరుపాసంగుననియు ననేకులు ననేకవిధములుగా జెప్పుకొనుచున్నారు. ఏదియెట్లు జరుగునో తెలియరాదు. ఐనను నాహృదా మీపరచినవాడనగుటచే సభామంటపమునకేగి యుదంతం బాద్యంతము గనుగొని మరలెదగాక. అదుగో రాజులుకూడ వచ్చియున్నారు.(అని వారలతో చేరికూర్చొనుచున్నాడు.)

(జయసేనుడను మరియొకరాజు ప్రవేశించుచున్నాడు.)

జయ—(ఒంటరిగా తనలో పటము చేతదీసికొని) ఆహా! ఏమి యీశశికళా సౌందర్యము. ఇంతమనోహరముగా శోభిల్లు సుందరాంగి దేవరాణియగునుగాని సామాన్యమానవు దలపెట్టునే? మున్ను వేదవతియను విప్రకన్య శ్రీమహావిష్ణువును బతిగాబడయుగోరి ఘోరతపంబుగావించి తత్ఫలంబందగోరి జనకుని ముద్దుకుమారియై ధరబుట్టి కేవలనారాయణుడగు శ్రీరామచంద్రుని చేపట్టబట్టి తనకోర్కె దీర్చుకొనలేదా? కాకున్న నాశివకార్ముకమును ద్రుంచ నెందరెందరో చేతగాక యవమానమంది తుదకు శ్రీరామునిచే క్రీడాసాధనమట్లు పటాపంచలుగావలెనా? అట్లులే యీశశికళకూడ నెట్టిమహాపురుషుని బడయగోరి నెట్టితపంబు గావించెనో? ఈమెకోర్కెదీర్ప నేమహామహుడెట నవతారంబు దాల్చియున్నాడో? గాని కేవలము రాజచంద్రు నైనంతమాత్రమున నన్ను వరించునా? అయ్యో? అందని మ్రానిపండున కాసవహిం

చనేల? పిలచిన పేరంటముగుట వచ్చితి. వచ్చినందుకు వేడుక దిలకించి పోయెద గాక! (అని కూర్చొనుచున్నాడు.)

(వీరవర్మ ప్రవేశము.)

వీరవర్మ:—(తనలో) అబ్బా! ఈస్వయంవరమునకెంత ప్రయాసపడి వచ్చితినిరా దైవమా! ఈశశికళాసౌందర్యము నామనం బెంత హరించినది. హరించినంతనే యుక్తాయుక్తవిచారణ సేయక కష్టములకోడి నేనిట్టిప్రయాణము సేయుగిట్టునే? ముదిమిచే మదిదప్పి మైపాటవముగూడ సన్నగిల్లి మృత్యుకాంతను చెట్టబట్ట స్థిరముగనుండవలసిన నాకీకాంతపైని యాశగల్గుట నాలోనాకే వింతగనున్నది. ఊ! వింతయేమి! ఎట్టివానికైనను "కాంతపైయాశ కనకంబుపై యాశ లేనివాడు పుడమి లేనివాడు" అని వచించుచుండరా! కాని యొక్కటి యోచించవలె. ఈకాంత నన్ను వరించునా? వరింపదా? నవమన్మథాకారులై యీడుజోడుగనున్న రాజకుమారు లెందరోయుండ నూరుపొమ్మని కాడురమ్మనమనునట్టి ముసలివానిని వరించునా? వరింపదు. వరింపదు! వరింపదని తెలిసియుండియు నేనిందేల రావలె? ఏల రాకూడదు? ఆహూయమానుండగుట వచ్చితి. వచ్చినందుకు ఫలితమేమి? ఫలితమేల యుండకూడదు? ఆబాల వరింపకున్న నేమి? నా శక్తిసామర్థ్యంబులు సుబాహునకు నెరింగించి నాకాబాలనిచ్చి వివాహము సేయఁ గోరెద. లోకంబున నెందరు జననీజనకులు తమ కన్నబిడ్డల ద్రవ్యమున కాసించి నాకంటె ముదుసలులగువారల కిచ్చి వివాహములు సేయుచుండుటలేదు. చేసిన నేమి? ఆనీచులసంగతి మనకేల? నేను మాత్రము నీకన్యను గైకొని చేయునదేమి? నీటిబిందువువలె క్షణక్షణంబు నకు నశింపుచున్న కాయంబునకు నాకిప్పుడు వివాహమేల? వలదు వలదు. వచ్చినందుకాబాల నెవరిచెట్టబట్టునో దిలకించి దీవెనల నిచ్చిపోయెదగాక!

(కూర్చొనుచున్నాడు.)

(కళింగాధిపతి ప్రవేశము.)

కళింగాధిపతి:—ఔరా! చతురంబోధిపరీతమై, భూవలయంబెల్ల నేకచక్రంబుగ నవక్రపరాక్రమంబున బరిపాలించుచుండిన నన్నుగాక యీశశికళ మరొక్కని చెట్టబట్టునా? నాసంగతి దెలియకము న్నొకవేళ యీబాల భిన్నాభిప్రాయురాలైయుండిన నుండుగాక! నాసంగతిట్టిదని యెరుగజేయు దూతికాముఖంబున బంపిన నాసందేశమును విన్నమీదటనైనను నాచే నియోగించబడినచేడియలామెకు వినుపించు హితోపదేశ మాలకించినమీదనైనా యిందిచ్చ జనింపకుండునా? అంతగా జనింపకున్న నాసంగతిట్టిదని నేనే స్వయముగా నెరుక జేసినమీదనైన గోరకుండునా? అప్పటికిని గోరక వేరొకరి చెట్టబట్టనిమ్ము.

ఎందరు రాజులో యుండ యింద్రాగ్ని యమవరుణులంతవారు స్వయముగా తమ్ము వరింప ప్రార్థించినను నిరాకరించి నలుని చెట్టబట్టిన దమయంతిగతి యేమైనది? అట్లులే యీకాంత మరియొకని గోరిన నామానోపాయంబుల నెట్టులైనను శశికళను చేబట్టకుందునా? నాతో చతురంగబలదర్పములతో నెవ్వడు సమానుడు గాగలడు? ఎవ్వడు నన్నెదిరించి నిల్వగలడు? కుడువబోవు రుచుల నడుగనేల?

(అని కూర్చొనుచున్నాడు.)

మాళ:—యుధాజిత్తుమహారాజా! ఇక్కడికే చాలమంది రాజులు వచ్చియున్నారు. ఐన నేనొక్క విశేషంబు వినియుండి మీతో చెప్పమరచితి. క్షమింపుడు.

యుధా:—అదేమి?

మాళ:—

ఉ. "తానిటవచ్చినాడట సు ♦ దర్శనుడుం దగువానిభంగి రా
ట్సూనులు రాజరాజసుత ♦ సుందరులందరినిం ద్యజించి త
న్నే నళినాక్షి కోరునని ♦ యే మనమందు దలంపబోలునే?"
కానలవాసికిన్ భ్రమయు ♦ గల్గుట వింతగదోచుచుండెడిన్.

యుధా:—ఏమేమి? సుదర్శనుండుగూడ వచ్చినాడా? వచ్చి కనుపించడేమి? నేను కర్ణాకర్ణిగా వినియున్నానుగాని కనుపించకపోవుటచే నేవినినది భ్రమయని తలంచితిని.

మాళ:—కాదు. కాదు. వచ్చియున్నాడు. ఈశశికళ వానినిదప్ప తక్కివారిని కన్నెత్తియైన చూడదట.

యుధా:—ఎట్లా? ఇందరు రాజులుండ కూటికి గుడ్డకుగూడలేక వనాంతరవాసియై యుండువాని నెచ్చటనైన వరించునా? నావలె నీవును పొరబడియుందువని తలంచెద. అంతియగాక నాకెక్కడ కనుపించిన చంపుదునేమోయని ప్రాణము లరచేతబెట్టుకొని మౌనివృత్తి కాలముగడపువాడు నిర్భయముగా రా సాహసించునా?

మాళ:—లేదు. మహారాజా!

యుధా:—మాళవాధీశ్వరా! నిజమా! ఐననేమాయెను? యీ యుధాజిత్తు బొందిని ప్రాణంబు లుండునంతకాలము ఆకాంత యాసుదర్శనుని వరించుట కలలోని మాటగా నెంచంగవలసినది.

కేరళా:—యుధాజిత్తీశ్వరా! నీయూహాపోహాలు లోకవిరుద్ధంబుగా నున్నవిసుమా! నీకు శత్రులైనంతమాత్రంబున లోకంబునకంతకు సుదర్శనుండు శత్రువగునే? ఆబాలుండు నన్నేమిచేసినాడు? నీకు రుచింపకున్నంతమాత్రమున నీరాజపుత్రి

వానిని వరింపఁగూడదా? అందు నీయడ్డేమి యున్నది? నాయడ్డేమి? తక్కినవారి యాటంకమేమి? ఇది స్వయంవరము. స్వయంవరమున నెట్టిదో యెరుంగవా? బలాబలంబుల చూపునదిగాదుసుమీ!

మ. "ఇది యిచ్ఛావరణార్థమేర్పడియెన • య్యేణాక్షి యిందొక్కరున్
మదికింపౌ తగువాని నంగభవుసా • మ్రాజ్యమ్మునం గూర్చునం
య్యది తక్కుంగల యస్మదాదులకవా • ర్యంబట్లు కాదేని దు
ర్మదు లీరాజులటందు రెల్లరును మ • ర్యాదావినాశంబుగన్."

ఒకవేళ నీవు తొందరబడి వానికేదైన యొగ్గుదలంచినమాత్రమున రాఁగలఫలమేమి? వాని కడతేర్చ నీవిదివరకెన్ని ప్రయత్నములు సలిపితివి? అవి యన్నియు నీకు ఫలితంబు లిచ్చెనా? వృద్ధుడవైనను నీబుద్ధిమాత్రము సన్మార్గమునఁ గాదుసుమీ! ఐనను వానిపై నీకింత యీర్ష్యయేల?

చ॥ అడియటులుంచు న్యాయమగు • నాతనిరాజ్యము దుర్నయంబునన్
మొదల హరించి యిచ్చితివి • ముద్దులమన్మని; కాతనిన్ వరిం
పదగదె? యీసుదర్శనుడె • పట్టముగట్టెనె! చేలరీతి నె
మ్మది నిటుగుందనేల? విను • మా! యితడేనిను చక్కఁ జేసెడిన్॥

యుధా;—కేరళాధిప! ఈపిలువని పేరంటమునకు నిన్నెవరుపిల్చిరి? రాజ్యప్రాప్తికై పాటుపడువారలుందురా? అందు నామనుమనికై నేను పోరాడుట ధర్మవిరుద్ధమా? ఇట్టిధర్మము లెవ నేర్పితివి? ఔరా! ఎంతటి రాజచంద్రుడవు? ఇటు వినుము—

గీ॥ "అగ్రజాతికి వేదమ్మ • లధికబలము
చాప మెక్కుడుబలమగు • క్షత్రియులకు"

అని సకలవేదములు శాస్త్రపురాణేతిహాసములు నొక్కరీతి ఘోషింపుచుండ రాజ్యమునకై మేము పోరాడుటయు, యరాతివీరుని దునుమాడఁ జూచుటయు క్షాత్రవంతంబుగదా? నీబోటి పిరికిపందలు రాజులైన రాజలోకంబునకు మంచికీర్తియే రాఁగలదు. చాలు నూరకుండుము.

కేరళా:—ఊరకుండక నిన్ను వేధింపుచుంటినా? పొరుగింటఁజూపు మా నాబోడి పెత్తన మనున్యాయానుసారంబుగ స్వయంవరమున కాహూతులమై వచ్చినారము. ఆకన్య తనకిష్టమైనవారిని గోరికొనిన చూచి సంతసించి పోవలసినదానికి మారుగా నేమేమో ప్రగల్భములు ఆడుచుంటివి. దైవనిర్ణయమైన నీవు తప్పింపగల్గుదువా? ఏటికీబింకములు? ధర్మమెందుండునో జయమందుండునని యెరుగవా కాన దుర్మార్గమునకుమాత్రము గడంగకుము.

యుధా:—ఇట్టినీతు లెన్నియో మే మెఱుగుదుములే! నీకీకంఠశోషయేల? నిన్ను బిలచి యడిగినప్పుడు చెప్పుదువుగాని లెమ్ము.

కేరళ:— సభాస్థలంబున నీవు నిర్భయంబుగ నుడువుటచే నే నిర్భయంబుగ జెప్ప సాహసించితిని. సుదర్శనుపై దీర్ఘక్రోధమూని బాలుని గడతేర్చ బ్రయత్నబడుటయేగాక యిప్పుడే స్వయంవరమునకుగూడ విఘ్నములొనరింప జూచుచున్నావు. ఇంతకు నీమనుమని వరింపుమనిగదా నీయూహా! ఆట్లే వరించునను కొందము. తక్కినవారుకూడ నీవలె క్రూరాభిప్రాయులైన నేమగును? ఎప్పటికైన—

ఉ. "అందరినిన్ వరింపదుగ ♦ దా యొకరాజతనూజ యిందరున్
సుందరు లిందరున్ మిగుల ♦ శూరులు దారులు వీరిలోన నా
సుందరి యొక్కనింగొనన ♦ నూయమెయిన్ మనమెల్ల బోరినన్
నిందకు మూలమా నిది య ♦ నీతియొ నీతియొ నిర్ణయింపుమా!"

ధర్మాధర్మవిచక్షణచేసి మాబోటి పిన్నవారిని మంచిత్రోవలకు దేజాలిన నీవే యుక్తాయుక్తపరిజ్ఞానశూన్యుడవై ప్రవర్తిల్లిన లోకంబున ధర్మమునకు నీడ యెయ్యది?-

యుధా:— కేరళాధిపా! మానుపటన్నకొలది నూరకొనక యూరక కంచుగీచినట్లు వాగజొచ్చినావు. సరే బాగున్నది. నీవనినట్లు యిది యిచ్ఛావరణార్థమేర్పడిన స్వయంవరముగదా! అయిన మాన్యుడై సకలనీతికోవిదుడై ధనధాన్యవస్తుసమన్వితుడైన యనఘుని గోరుకొనవలదా?

కేరళ— కాదు. బీదవానిని. అందు హీనుని తనమనసార గోరుకొనును. దాని యోగుబాగు లది యెరుంగదా? అందు నీనాయాటంక మేమిగలదు? చూచి గోతిలో పడబోవువారిని మనము వలదని వారింపనేల? లేనియపయశము బొందనేల?

యుధా—అట్లని యూరకుండుట బాడియా?

చ॥ "పలువురఖండతేజులు నృ ♦ పాలకుమారకులుత్తమోత్తముల్
గలయెడ నెవ్వడో యొకడ ♦ గన్యుడు కన్యబరిగ్రహింప యో
గ్యులుగని యూరకుండుటది ♦ యున్ గడుయుక్తమె! సింహభాగ్యమా
పలలము నక్కకున్ విడువ ♦ బాడియె! యేడవి? నీతివాక్యముల్."

మరియు వినుము-

"బలముగలవాని రాజ్యమీ ♦ పడతిమిన్న
బలమశుల్కంబు రాజువి ♦ వాహములకు"

అట్టియుత్తమగుణములు సుదర్శనునకుం గలదేని యతండె పరిగ్రహించు. యిత
రులకు గలదేని యితరులు పరిగ్రహింతురు. కంఠశోష నీకెందులకు?

కేరళ—నీకెందులకో నాకందులకే! సభాముఖంబున ధర్మాధర్మవిచక్షణకలిగినప్పు
డు చెప్పకుండుట పాడిగాదు. గనుక చెప్పవలసివచ్చినది. చెప్పితిని. మం
దబుద్ధివి నీవు కాదనిన నాది తప్పగునా?

( ప్రవేశము —సుదర్శనుడు. )

సుదర్శనుడు—(తనలో) నాకతంబున సుబాహున కెంతటిచిక్కు తటస్థించె. అడ
కత్తిలోని పోకచందంబున జిక్కుకొని పరితపించుచున్నాడు. రాజలోకంబు
ను నిగ్రహించజాలడు. కుమారిపై ప్రేమ విడనాడనోపడు. ఇంతకు నేనేగదా
కారణము. అక్కటా! ఆశశికళకు నాపై మోహమేల కలుగవలె? కల్గిన
జననీజనకులు తగవుగాదని యెంత దెల్పినను యేటికి వినకుండవలె. వినకపోవు
టచేత నేగదా యింత పొసగె. ఆనాడట్లు విప్రుని నాయెడ కంపకయున్న
నీపురి బాహ్యోద్యానవనమున నే బడలికదీర్చుకొన విశ్రమించి యుండ
నా చెంతకరుదెంచి తనకటాక్షములు నాపై ప్రసరింపజేయకున్న, దైవాజ్ఞ యె
ట్లయిన నట్లు గాగలదనునమ్మకముతో నంతగ విచారింపకుందునుగదా! అక్క
టా! తదాదినుండియు నాశశికళపై విరాళి మరల్పకుందమన్నను మరలకయుం
డె. ఏమిసేయుదు? హా! శశికళయందలి మోహమా! నిన్ను నాకడచక్షురూ
పముతో బంపిన మీచెలినే జేరబొమ్ము. నీకు నాకు గడుదూరముసుమీ!
నిన్నటి నీపలుకులే నాకమృతోపములని సంతసించి యింతట వెనుకకు మరలెద.
నీచూపులే నాకు మహాప్రసాదమని సంతసించెద. నీసందేశమే నాకు సర్వా
దాయానందదాయకమని తలపోయుచుండెద. కానిచూచి చూచి యెరిగి యెరిగి
నేనిప్పుడు తెంపుజేసి నిష్కారణముగ నమాయకుండగు నీజనకునకు నాపదలు
ఘటిల్లచేయ మనసొప్పకున్నది. మనకీరువురకు దైవఘటనమే యుండిన నిన్న
నీవుద్యానవనమున నాచెంత కరుదెంచినప్పుడే మున్ను రుక్మిణీమహాదేవిని గైకొని
పోయిన శ్రీకృష్ణునిచందంబున గైకొనిపోయియుందును. లేకపోబట్టియే నేనంతటి తెం
పు సేయనైతి. అంతటియూహ కలిగినది కాదు. అయ్యో! సమయము మించి
పోయె. ఇప్పుడనుకొని యేమిప్రయోజనము. ముందుజన్మమునకైనను నిన్నె
సతిగా జేయు నంబామహాతల్లిని మనసార స్మరించుచుండెద. గాని యిప్పటికి
మాత్రము స్వయంవరమంటపమునకు రా సాహసింపజాల. అక్కటా! నాకిది
యేమివెట్టి? దేవీయాజ్ఞాబద్ధుడనై నిచ్చటకరుదెంచి చేలదీతి పలురీతుల దల
పోయుచు ఆమహాతల్లికి వ్యతిరేకముగా చేయదలంచుచుంటిని. భాగ్యమో
భాగ్యమో ఆమెయానతిచొప్పున కాగలదు. సభామంటపమునకే పోయెద
గాక! సంభవించిన శశికళనెయ్యమే సంభవింపగలదు. లేకుండిన నన్యథా

జరిగినమాత్రమేమిభయము? శశికళదాంపత్యమే దొరకని నాకీప్రాణములుండి యేమి? లేకున్న నేమి?—

( అనిపోవుచున్నాడు, రాజలోకముతో జేరుచున్నాడు. )

మాళ—(జనాంతికముగా) నేజెప్పలేదా? అదుగో! సుదర్శనుడు రానే వచ్చినాడు.

యుధా—(జనాంతికముగా) సరే! రానిమ్ము. ఎన్నిదినములనుండియో వీనికొరకెదురుచూచుచున్న నిప్పుడు తనంతతానే దొరికినాడు.

కేరళా—(సుదర్శను చేరబోయి)

ఉ॥ "ఓయినృపాలపుత్ర! యిట ♦ నొక్కరుడై చనుదెంచితీవు నా
నాయుతులెందరో నృపతి ♦ నందను లాహవమాచరించి య
బ్జాయతనేత్రి నీశశిక ♦ లాబ్జముఖిన్ గ్రహియింపనున్న వా
రీయెడ నీకుజేయగల ♦దించుకయున్ గనుపట్టనేర్చునే."

అందరిమాటయేల? అందరికన్న మిన్నగ

శా॥ "నీకుందమ్ము డఖండశౌర్యనిధి వ ♦ ర్ణింపంగ యోగ్యుండు లో
కైకాగ్రేసరుడు శత్రుజిత్తును సహా ♦ యీభూతుడై తాతయున్
నీక న్నిన్నువధింప నిచ్చ్యెడకొగిన్ ♦ విచ్చేసియున్నారు నీ
రాకత్యంతము శోచనీయముగదా ♦ రాజన్యవంశాగ్రణీ."

నిన్నెవ్వరుపిల్చిరో? నీవెందుల కిచ్చటికి వచ్చితివో యూహింపజాలము. నీసంగతినిగూర్చి పెక్కండ్రు రాజచంద్రులు కడువిచారించుచున్నారు గాని చేయునదిలేక మిన్నకున్నవారు. ఇచ్చటిసంగతులు చాలగనున్నవి. తెలుపవలసిన దానిని తెలిపితిని. నీచిత్తవృత్తిమెయి నీశ్రేయస్సునుగూర్చి యోచించుకొనుము.

సుదర్శ—(వినయముతో)

ఉ॥ సారసనద్మణాకలిత ♦ స్వాంతయశోపరిపాలులార! "మీ
పేరిమియింతయొప్పునొకో? ♦ భీతిలి యిప్పుడు లాభమేమి? నా
భారము దేవదేవి దిట ♦ బంపినదాజగదంబ నాకునై
క్షీరమొ? నీరమో? యొకటి ♦ సేయదె? శత్రులజేతికిచ్చునే?"

ఉదారమనస్కులకౌట మీకునాయందలి గలిగిన యవ్యాజప్రేమచే మీరింత భీతిలుచుంటిరిగాని మీరు భయమందబనిలేదు. నాకు నట్టిభయ మావంతయు

లేదు. అందున నేనొంటరిగా నిందు రాలేదు. దీనికొక పరమరహస్యముగలదు. ఏమంటిరేని,

ఉ॥ ఎలమి సమస్తవస్తువుల ♦ నేకస్వరూపముతోడనొండి స
ద్వ్యాలను నిజాకృపానుమతి ♦ బోషణజేసెటి దేవదేవి "నా
కల గనుపట్టి పొమ్మనిన ♦ గన్గొనవచ్చితి నీస్వయంవరం
బలుఁగ నెవండు నన్నెదురు" ♦ నాతడు నొక్కడు లేడుయిచ్చటన్॥

అట్లుగాః మీరనినట్లు నెవ్వడైన మందబుద్ధితో నాకపకార మొనరించదలపెట్టిన నాయంబికకే దలపెట్టినవాడగును. కావున నట్టివాడు మహాదేవి యాగ్రహంబునకు పాతుడుగాకపోడు మఱియు నే నసహాయుండనని దలంచుచుంటిరేమో! అట్లు దలంపవలదు. నాకేలాటి సంబంధమైన బలమక్కరలేక సాక్షాత్తు యిహపరములయం దుపయోగించు నిత్యసత్యంబగు దేవీబలమున్నదంతియేచాలును. ఆమహాదేవిని నమ్మినవారు చెడుటకలుగునే? వేయేల?

మ॥ "బలమిచ్చున్ యశమిచ్చు సంపదలిడున్ ♦ భావించు దేలించు దు
ర్బలులన్ జేయు దరిద్రులన్ బొనరుచున్ ♦ భంజించు గుంజించు నే
యలఘుప్రాభవ యేజగజ్జనని యే ♦ యార్యామహాదేవి త
ద్బలమే నాకు బలంబు తక్కబలమున్ ♦ జాటింపనే నెన్నడున్."

కావున స్థిరబుద్ధితో నాపలుకొక్కటి నాలింపుము.

క॥ "శక్తులశక్తులు గలరే
శక్తి యనుగ్రహముగల్గు ♦ జను వేశక్తుల్
శక్తికృపలేనివారల
శక్తులు బ్రహ్మాదులైన ♦ జనవరులార!"

కావున నాకెట్టిసందేహము లేదు. ఒకవేళ మీరనినట్లు యామహాదేవికి నాయందు కృపతక్కువగుట యపజయము కలుగునందురేమో? కలిగిన కలుగనిమ్ము. నాయందేదియో లోపముండ నట్లుకలుగు. ఐన నది నాదియగునా! తనదాసునియందు గలిగిన స్వల్పలోపమును గణుతించి వేరువిధంబుగ జేయ దలపెట్టదు. కావున నేనశక్తుడననియు సహాయశూన్యుడనియు దలంపబోకుడు.

కేరళా — సుదర్శనా! నీవట్టివాడవే నే నెఱుంగకగాదు. నీవతిపుణ్యాత్ముడవు. ఐనను యీయుధాజిత్తు క్రోడత్రాసువిధంబున బగబూనియున్నాడు. వాడెట్టివేళ యేసందర్భమున మఱువదగినవాడు కాడు. నీ జాగ్రత్తయందుండుము.

సుదర్శ—రాజచంద్రులారా! మీకు నాయందనుగ్రహంబింత యొప్పిన కతంబునగదా యింతవట్టు నాకెఱింగించితిరి. దైవాధీనంబగు నీచరాచరాత్మక ప్రపంచంబున మృత్యువనునది తనంతన ఘటించునుగాని యొకనినొకడు చంపువాడులేడు. జీవుండు కర్మాధీనుండుగాని స్వతంత్రుడుగాడు. కర్మంబున సంచితవర్తమాన ప్రారబ్ధభేదమ్మున మూడుదెఱంగులై యొప్పు గాలకర్మ స్వభావవ్యాప్తంబగు నీజగంబున గాలం బాసన్నంబుగాదేని దేవునకైన జంపనశక్యంబు. కాలవశంబున మృతుండగు జీవునకు యముండు నిమిత్తమాత్రంబుగా నెఱుంగునది. కాలం బాసన్నంబగునేని యెవ్వడు నడ్డుపడజాలరు. గనుక వకరికి భయపడనేల? వకరిపొండ జేరనేల? దైవబలమున్నంతవరకు నీయుధాజిత్తునకేగాదు. మఱి యేయితరములైన రోగాది భయపడవలసినదిలేదు. అది లేనప్పుడు చీమకైనను వెనుకంజవేయవలసినదే సుమీ! అంతియగాక సుఖదుఃఖంబులు పూర్వజన్మ సంచిత విశేషంబున గలుగుచుంట మనమిప్పుడు వలదనినను వెనుకబడదు. అంత మాత్రంబునకై జనులజ్ఞత కష్టములకు భీతిల్లుటయు, సుఖమునకు సంతోషించుటయు నక్కడక్కడ జరుగుచుండును. నాకుమాత్ర మట్లుగాదు. నాకేగాదు, ప్రాజ్ఞులగు వారికెల్లరకు నంతియే కావున రాజచంద్రులారా! అయ్యుధాజిత్తునకు నేను శత్రువునైన నగుదుగాక. నాకుమాత్ర మతడు శత్రుడుగాడు. అతడు సుఖపడుచుండ నేను దుఃఖింపను. కావున,

ఉ. "దైవము నమ్మినచ్చితిని దైవము సైన్యము తోడునీడయుం
దైవము తల్లిదండ్రులును దైవము వైరియు నాకుసర్వముం
దైవము తద్బలంబు సుఖదాయియు కష్టమొనిచ్చునట్టిదో
భావిఫలంబెఱుంగ మనపాటిమనుష్యుల కర్హమెట్లగున్."

(ప్రవేశము - సుబాహువు.)

యుధా—రాజా! స్వయంవర మింతయేనా? ముందుజరుగున దేదైనగలదా? ఏదియు త్వరితముగ జెప్పుము.

సుబా—(తనలో విచారముగ) అక్కటా! ఎట్టిసంకటము ప్రాప్తించె.

ఉ. "వచ్చినవారు రాజుల నవద్యచరిత్రులు వేనవేలు వీ
రిచ్చకమాడినన్ వెడలరేమియొనర్తు మదాత్మజాతకు
న్నచ్చిన యీసుదర్శనుడనన్ బలహీనుడు నాకువీరిచే
జచ్చుట సంభవించెనిది, శత్రువు పుత్రికగాదుగాతుదిన్."

(ధైర్యముతో) ఏమైనగానిమ్ము. వీరిని నయంబున బ్రార్థించ మనసగుచున్నది గాని కుమారి నొప్పింప మనసురాకున్నది సాధ్యమగురీతి బ్రతిమాలెదగాక పిదప దైవముగలడు (రాజుల నుద్దేశించి)

ఉ. "ఓనరపాలులార! కరుణోదధులార! మహాత్ములార! నా
పై నెనరుంచినాదు పొరబాటుక్షమించి యనుగ్రహించి నా
మానముబ్రాణముల్ మిగులమన్ననజేసి యొసంగికూర్చు స
న్మానముల్ గ్రహించి చనుమానమునన్ దయచేయుటొప్పగున్."

మేమెన్ని విధంబుల బ్రతిమాలిచెప్పిన నక్కన్నియ నొల్లక పట్టుబట్టియున్నది. అబాలమనసు నొప్పింపలేక కన్నకడుపగుట మనస్సు చొరకున్నది. గావున నాప్రార్థన నాలకించి నాపుత్రిక మీపుత్రికగ భావించి సదుద్దేశముతోనుండి వివాహమహోత్సవము దిలకించి వధూవరుల నాశీర్వదించ ప్రార్థించుచున్నాడ.

యుధా—ఏమేమీ! నృపాలాధమా!

ఉ. "ఏమివచించెదీవు మదినింతవివేకము లేకపుత్రికన్
సోమరివై సుదర్శనుని సొమ్ముగ జేయదలంచి యోగ్యులన్
భూమివరేణ్యులన్ వెడలిపొమ్మనలేకిటు నక్కజిత్తులన్
వేమఱుపన్నినన్ దెలియనేరమె! తక్కొరులంత మూర్ఖులే."

సుబా—మహాత్మా! నేనట్లెన్నడు దలంపలేదు. కార్యంబనివార్యంబగుట నింతపట్టు నకు మిమ్ము బ్రార్థించుచుంటి.

యుధా—ఔరా! చంకదుడ్డు శరణార్థియనుమాట నెక్కడ నేర్చుకొంటివి. అంత యనివార్యమేమి తటస్థించినది. మొదలే సందియంబయిన నీపిల్లను నీయిష్టము వచ్చినవారికి యేనిప్పించకొనకపోతివా. ఇంతమాత్రము నాడదాని లొంగదీసి బుద్ధిచెప్పలేని రండవు యింతటికార్యము బూని చేతగాని పెత్తనము పైవేసుకొని మమ్మేల నాహ్వానాయమరచితివి. ఇంతు గెలువలేకున్న రచ్చనేమి గెలువగలుగుదువు. ఇట్టి అవాచ్యుడ నెరీతి రాజ్యపాలన మేగించుచుంటివి. ఔరా!

శా. "భారద్వాజమునింగణించిమును తత్ప్రాణంబుపేక్షించి
స్వీరుల్ వీరలు మెచ్చనేడదతు నీనేర్పింక జాలించి యా
నీరేజాక్షిని నాదుమన్ననికి బెండ్లింజేసి రక్షించుకో
మ్మా! రాజ్యంబు మదాశ్రయంబుకలిమిన్ మేలెంచి కీడెంచుమా!"

ఒక్క సుదర్శనుడక్క తక్కినవారలలో నెవ్వరికైన గోరదేనినీకు పోరాటంబు

దప్పదు. ఇప్పుడైనను చెడినదిలేదు. నాహితంబరసి నీకింకొక్కరోజు గడు విచ్చెదము. మతిని సైనవరించునట్లు జేయుము. ఔరా! సుబాహు! నీబుద్ధి యెంత పెడతలబట్టినది. "నీచాశ్రయోన కర్తవ్యం" బని పెద్దలు వచించు నీతి గూడ మఱచితివా? ఏమని కూటికిలేక గుడ్డకుగూడ దూరస్తుడై యడవులవెంట నలోలక్షణా యని తిరుగువానికొక నరాధమునకు పిల్లనియ్య నెంచితివి. ఛీ! ఇంతటినైన మదాశ్రమంబుగోరితేని నామనుమవకిచ్చి శశికళను పెండ్లిసేయుము లేదా నీపాట్లకు మితియుండదు! ఆసుదర్శనుడేమైన నీకడ్డువచ్చునని తలంచితివేమో! వాడిరక్షణ వాడు చేసుకొనలేమి రండనిన్నను నీకూతు నేమిరక్షించ గలడు. యోచించుకొనుము.

కేరళా—యుధాజిత్తు మహారాజా! నీవాక్యము లతిదారుణములుగానున్నవి. వినసహ్యములైనవి.

సుబా—మహాత్ములార! అట్లయిన నేటిదినమ్మున కీసభజాలింతము. నీకార్యంబునెల్లి సమర్థించెద నాకనుజ్ఞయిండు.

యుధా—నేను మొదటనే చెప్పలేదా! అట్లే కానిమ్ము. రేపుదయమునను సర్వము సిద్ధముచేయుము. లేకున్న యుద్ధమునకు సిద్ధుడవుకమ్ము. నామనా! శత్రుజిత్తా - భయపడకుము నిన్నుగాక మరియొక్కని శశికళ వరించునా, గమ్ము పోవుదము.

(అని అందరు పోవుచున్నారు.)

సుబా—(సుదర్శను కనుగిటి) రాజపుత్రా! నీతోరహస్యముగా గొంత ప్రసంగించవలసియున్నది. విడిది కరుదెమ్ము.

సుదర్శ—చిత్తము మహాత్మా.

(అందరు నిష్క్రమించుచున్నారు.)





# శశికళా సుదర్శనీయము.



## పంచమాంకము.



### కాశీకాపురము.

### స్వయంవరమంటపము.

సుబాహు.—[శశికళను ముందిడుకొని] నాయనా! సుదర్శనా! మేమెన్ని ప్రయత్నములు చేసిననేమి? దైవవిధి ప్రకారము జరుగునుగాని మన తలంపులెందుకు బనికి వచ్చు? వివాహమున కెన్నియాటంకములేర్పడినవి. వానినన్నిటిని సమర్థించుకొనుట మాకెంతకష్టమయ్యెనో నీవు స్వయముగా గనుచుంటివిగదా? ఇంతకు మా పూర్వపుణ్య విశేషంబున నీబోటి ప్రధానుడు మాకు జామాతగా లభించినాడు. సంతసమయ్యె. ఈబాల మనోవాంఛ నీడేరె. నంతియెచాలు. తక్కిన వ్యవహారములెట్లున్న నేమి? ఇంతటి యసంగతమని సర్వులు దలంచిన కార్యమును సమకూర్చిన దేవి తక్కిన కార్యముగూడ సమకూర్చి ఫలంబొసంగకుండునా? ఆచింతయేనాటికిని లేదుగాని నీతో నొక్కసంగతి జెప్పదలచితిని. అది నుడువుటగూడ యనవసరమేయైనను, కడుపారగని పెంచినవారమగుట కడుపుతీపి నన్ను మఱిమఱి ప్రేరేపించుచుండుటచే సాహసింపక నూరకుండజాలనైతిని. చిన్నవాడవయ్యును బుద్ధియందు బృహస్పతి సమానుడవై జగదంబకాయుపాసకుడవైన నీతిమార్గము లుపదేశించవలసిన యవసరమే యుండదు. ఐనను లోకపరిపాటి చొప్పున పెద్దవాడనగుట చెప్పనుంకించితి. క్షమింపుము. అయ్యా! ఈ బాల వట్టిగోల. ఎండ కన్నెఱుంగని సుకుమారి. ముద్దరాలు.

ఉ॥ బాలగదయ్యె లోకపరిపాటి నెఱుంగని వట్టిగోల నీ
కేలను బెట్టినాడనిదె కీర్తివహింపుమ మంచిచెడ్డలన్
జాలగనేర్పి! కోపమునుసల్పక సాకులంబువారిలో
బాలకుమారుకు కీర్తినిడ భారమునీపయి బెట్టినాడగా!

సుదర్శ-మహాత్మా. మీరింత నొక్కి జెప్పవలయునా? ఐన మీయాజ్ఞ శిరసావహించితిని. అంతియెగాక

ఉ॥ "ధీరులయందు నుత్తముల దీనరులందు గృపాళులన్ మహా
దాతలవీరులన్ మఱియు దన్యులమాన్యుల నన్యులందు నిం
కేరుభవత్సమానులు మహేంద్రమహేంద్ర! సుబాహుభూప! మా
భారము"యెల్ల మీదగుట భారము నాకిక వేఱెయుండునే.

వేయేల? ఇంత యలజడి జరుగుచున్నను దాని లెక్కగొనక నాయందలి యవ్యాజప్రకరణాస్థితిగతులనైన నెంచక సాహసించి నాకు చక్కని మహోపకారంబొరించిన మీసద్గుణములెన్నటికైన మరువదగినవియే. లోకంబున సాధారణంబుగ

ఉ॥ "ఎవరికినైన బుత్రికల నిచ్చెడిచో ధనధాన్యసంపదా
ధారనిహార పుష్పవనతల్పములాదిగ గల్గుభాగ్య వి
స్తారము నెంతురెంతటి వదాన్యశిరోమణు లట్లుగాక" ని
స్సారుడనాకు నీసుతనొసంగితివెంత యుదారశాలివో.

సుబా—అయ్యా! ఇందు నాయతిశయమేమున్నది. ఇట్టివాడవనియు నిన్ను మా శశికళ వరించుటయే ముఖ్యము. కుమారికపైని భారమును ద్రెంపజాలక తదుపరి నేనియ్యకొంటిని. అందచే నాయది సుంతయు బొగడదగినది లేదు. ఇంతకు దైవఘటనాట్లున్నది మంచికిగాని చెడ్డకుగాని మనుజులు స్వతంత్రులా!

సుదర్శ-అవును. మీరనినట్లు దైవఘటనకు మాత్రము మనమెల్ల నంగీకరించవలసినదే. ఐననె తద్దైవఘటనయున్ననేమి? చూచి చూచి గోతిలో దోచినటుల రాజ్యహీనుండై కేవల కుక్షినింపుకొనుట కేదోవగానని నాబోటి నిర్భాగ్యునకిచ్చుటకన్న వారలెందేని సాహసింతురా? ఇందునకే నినుగొనియాడవలసినది.

సుబా—అయ్యా! పదే పదే రాజ్యహీనుండనని ఖిన్నతనొందకుము. ఈరాజ్యంబింక నెవరిది? నీదిగాదా! నాకింక వేరుకుమారులా? కుమారితలా? అన్నిటికి మీరిపురేగదా. అట్లగుట

ఉ॥ "నారాజ్యంబఖిలంబు నిచ్చెదను సేనానత్వముం బూనదన్
నీరాజ్యంబిది యేనుసేవకుడ నానీభేదమేలా? పరా
నీరన్యాయమునన్ వసింపుదము మన్నీలున్నవారింక ద
ద్వైరంబెట్టులొ సామదానములనో వారింతుభేదాననో."

అట్లు మన యత్నములు సఫలములుగాక వైరంబే నిశ్చయంబుగనున్నను భయం బులేదు మీకిరువురకు నిట్టి సంఘటననుగూర్చి మిమ్మొక యింటివారలను నా మనంబునుగూడ ద్రిప్పినట్టి జగదంబే మనకు తోడునీడ కాగలదు. అందునకు జంకనేల ?

సుదర్శ-అయ్యా ! జంకేటికి, భీతియేటికి నీ వాక్సుధారసమున నా కిదివరకుండిన స్వల్ప చింతయు నశించినది. నీరాజ్యము నీకేటికి ? నీవ యేలుకొనుచుండుము. నాకు రాజ్యమేలు ప్రాప్తియుండెనా నాకనవరతము తోడునీడయైనను కనుసన్నల గాపాడుచుండిన శర్వాణియే నాతండ్రిరాజ్యమును నాకు దెచ్చియివ్వగలదు. దానినే పాలించుకొనువాడను. అట్లుగాక నాప్రాప్తియన్యథానుండెనా మీరు రాజ్యంబునాకొసంగినను యది నాకు దక్కనేరదు. ఇటువినుడు.

ఉ॥ “కరమునమున్నపట్టనది కాంచనమౌ దనయత్నమింతయుణ్
బోరయకయే సమస్తమును బూర్ణముగన్ ప్రజలందరుణ్ మహా
దరమువహింతురీ నెమ్మది ముదమ్మునబొంగు సమస్తకార్యముల్
సరిపడు నెక్కపెట్ట గ్రహచారముచాలిన యప్పుడేరికిణ్”.

అట్లగుట నావిషయమై మీరావంతయు విచారించవలదు. అంతియగాక దీని కొక నీతిగలదు. ఏమన

ఉ॥ “చింతయొకింత లేదఖిల జీవులకుణ్ సుఖవేళగష్ట మొ
క్కింతయురాదు కష్టమున నించుకయుణ్ సుఖమబ్బబోదు లె
మ్మింతకు నాకుజూడగను నిప్పటికాలము మంచిదౌట నా
వంతయువంతరాదిక ప్రయత్నమొనర్పుము కూతునంపగణ్.”

దౌవారికుడు-(ప్రవేశించి) రాజా ! పరాకు. దేవరవారి జామాత నిపుడంప ప్రయత్నము జేయకుడు. ఈ మహారాజును గడతేర్చ పెక్కుయరాతులు రాక్షసుల క్రియ ద్వారముల గనిపెట్టుకొని యున్నారు. వారల నెదుర్కొన భీతిగలుగుచున్నది.

సుబా—నిజము దౌవారికా ! నేను యదియే యోచించుచుంటిని.

సుదర్శ-మామా !

ఉ॥ “నృపవరవారలేమి యొనరింపగలారొనరించి దేవి స
త్కృపగలతల్లియౌ జగదధీశ్వరినాకు సహాయభూతమై
రిపుల నడంపకున్నె తగురీతి ప్రయాణమొనర్పుమయ్య మా
తపసులయాశ్రమంబున ముదంబుననుండెదమయ్య తద్దయుణ్”.

సుబా-కుమారా! ఇదే ప్రయాణము సిద్ధము జేసితిని. అమ్మా! నన్ను మరువబోకుమీ! కేవల బుద్ధిజ్ఞానసంపన్నురాలవును, నధికవిద్యావంతురాలవునగు నీకు పతివ్రతా ధర్మములు వేరుగ జెప్పనక్కరలేదుగాని యొక్కటిమాత్రము చెప్పవలసియున్నది ఏమంటివేని నీవతి పట్టుదలదానవు ఈ వివాహంబునకు బలె నీపతిచెంత నీకొద్ది యేది గలకోర్కెపై పట్టుదలపట్టితివేని సంసారము చెడు. పతి కోపగించు. అది మాత్రము కనిపెట్టి ప్రవర్తించుము. ఇదె రథంబాయత్తంబైనది. రండు.

(తెరలో యుధాజిత్తు)

ఉ॥ పోకుర పోకు మెచ్చుటికి పోయెదవోరి సుదర్శనాఖ్య నీ
కై కనిపెట్టియుండి చిరకాలమునుండియు నేటికక్కటా
రాకనురాక కంటబడి రాజులనందరి చిన్నబుచ్చి నీ
వీకరణిన్ పరుంగిడిన నెంతయునూరక పోవనిత్తుమే.

సుబా—(ఆలకించి) కుమారా! చూచితివే! అల్లదే మనుమనుకొనినయట్లు యుధాజిత్తు రోషభీషణాయత్తచిత్తుండై వచ్చుచున్నట్లున్నది.

(తెరలో)

ఉ॥ పోకుర పోకు మెచ్చుటికి పోయెదవోరి సుదర్శనాఖ్య నీ
కై కనిపెట్టియుండి చిరకాలమునుండియు నేటికక్కటా
రాకనురాక కంటబడి రాజులనందరి చిన్నబుచ్చి నీ
వీకరణిన్ పరుంగిడిన నెంతయునూరక పోవనిత్తుమే.

సుబా-అబ్బాయీ! ఇప్పటికైన నిజమరసితివా! ఇంకచేయునదేమి. పోరు తప్పదుగదా

సుదర్శ-అయ్యా! రానున్నయాపదలు భయపడిన వెనుకకు బోవునా? రానిమ్ము. వచ్చి యేమిచేయునో చూతము.

యుధా-ఉ॥ "పోకుర పోకు మెచ్చుటికి" అను పూర్వోక్తపద్యముఁజదువుచు శత్రుజిత్తుతో ప్రవేశించుచు)[పరికించి] ఓహో! మామయల్లుండ్రు నొక్కచోట నే తటస్థించిరి. శెహభాష్ ఇరువరకొఱకై వేలువేలుగా ప్రయత్నింపనక్కరలేకయే సమకూడినది. ఔరా! అదృష్టమన నిట్లుగదా యుండవలయు. ఓరోరి! రాజకులభండాల!

చం॥ అరయ స్వయంవరంబనుచు నందరిరాజుల బిల్వబంచి దు
ర్భరపు మృషాస్వయంవరముపద్ధతి రాజులమోసగించి సం

బరమున కూతు నల్లుని నపారముదంబున దొంగదారి వే
గిరమున బాపుచుంటి విరకీర్తిని జూడక రాజపాశనా !

అంతటితో నీపైభారము తొలగిపోయినదనుకుంటివేమి? నీఫలితము నీవుకూడ ననుభవించవలసినవాడవైనను తొలుదొల్త నాకాజన్మశత్రువగు నీసుదర్శనాథముని పనిగొని తదుపరి నీభరతము పట్టించెద.

సుబా — ఆహా! మించివచ్చినది. నేనిదే నేగి సుదర్శను సహాయార్థమై సైన్యంబు కొని వచ్చెదను. (నిష్క్రమింతురు.)

యుధా — ఓరోరీ! సుదర్శనా! మామకాలికి బుద్ధిచెప్పినాడు. అల్లుడవైన నీవును అట్లుచేయుము లేదేని నీప్రాణంబులు దక్కవు.

ఉ. ముందును వెన్కజూడకను మూఢతనీకు సుబాహువక్కటా
సుందరి నిచ్చెనేయనుము జూడగ నీదగు శక్తియుక్తినా
కుందగు కాంతజిక్కనని గొబ్బునగైకొని పోవజూతువే
సందియమింతలేక నృపసత్తములెందరో చూచుచుండగన్.

అట్లు వారందరూరుకొన్నను నేనైతుననుకొంటివిరా! తొల్లి నీరాజ్యంబు హరించి నిను కాంతారంబున కంపిన చందంబున యిప్పుడీకాంతను విడిచి కాంతారముజేరి ప్రాణంబులను దక్కించుకొనుము. కాక తరుణిపై భ్రాంతిచే పెనగులాడుచు తగవులాడ గడంగితివేని నీకు చావుతప్పదు.

సుద — చిన్నితాతా! ఆలాగే నీయిష్టప్రకారము గావించెదనుగాని నాపలుకొక్కటి యాలకింపుము. నీశత్రుజిత్తువలె నేనుకూడ నీకు మనుమడనేగదా! నాపైన నీకీకినుక యేల? ఒకవేళ నతనిగూడి రాజ్యమేలించదలచుకొన్న పిత్రార్జితమైన రాజ్యమునందు దాయభాగము నిర్ణయించి నాతనికిగూడ నొసంగిన నేవల దంటినా! అట్లుసేయక మమ్మన్యాయముగ నరణ్యవాసమున కనిపిన చచ్చిపోదు మనుకుంటివా? దైవవిధిప్రకారముగా జరుగునుగాని నీవెన్నివిధముల మారు ప్రయత్నము లొనరించినను నీయిష్టానుసారంబుగ జరుగనేరదు. కావున నిప్పుడును దైవఘటనచే నాకు లక్ష్యమైన నీకాంతాలలామను వీడిపొమ్మనుటేటి ధర్మము. ఆనారి నీమనుమనిసొమ్ము కాదు. కనుక నేవానికిదక్కక నాకు దక్కినది. అంతమాత్రమున నసూయాగ్రస్తుడవై నాతో పోరికిగడగుట ధర్మమగునా? సాటి రాజలోకంబిది చూచి నిన్నెంత దుర్మార్గుడనుచుంటిరో యెఱుంగకున్నాడవే. వయోవృద్ధుండవైనందుకు చిన్నవారలేదైన చెడుత్రోవ ద్రొక్కిన మందలించవలసినదానికి మారుగా నీవేకష్టాత్ముండవై నికృష్టంపుపనుల నుచేయ మొదలిడిన వారించువారెవ్వరు? కంచెయే చేనుమేసిన వేరుదిక్కు

గలుగునే. కావున నామాటలాలించి వృథాగా డంబరములచే పూజ్యుండగు నీసుబాహుని నిందించియేల నరకకూపమునఁబడ సాహసించెదవు?

యుధా—ఔరా! తగదనని దొంగపెండ్లిజేసుకొని కన్నపుదొంగవిధంబున పారిపోవు నదేగాక తగదని మందలించిన మాకే నీతులుపదేశింప వచ్చితివిరా? గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినదను సామ్యము తథ్యమే సుమీ! ఏమిరా! వదరుబోతా! నీమాత్రము నీతులు మేమెఱుగమనుకొంటివా?

సుద—ఎఱుఁగుదువు. ఎరుగకేమి? కాని బుద్ధిమాత్రము పెడదంబట్టినది. స్వకార్యాశక్తుల కిట్లగుట లోకస్వభావికమే గదా? అందు నీదోషములేదు. కాని నీయజ్ఞానంబునకు చోటివ్వక జ్ఞానివై సాటివారిలో దురాత్ముడని పేరొందక సర్వజనసమ్మతంబుగ మెలంగుమని ప్రార్థించుచుంటి గాని నీకు నీతులుపదేశింపరాలేదు.

యుధా—ఔరా! నక్కటక్కులెన్ని నేర్చితివిరా? ఇంతకు నిన్ననబనియేమి? అలనాడు భారద్వాజాశ్రమంబున నీవుండుటెఱిఁగి నిన్నుఁ గడతేర్చ వచ్చియు, జాలి దలచి వెనుకంజవేయుటచేత నామందబుద్ధికి నన్నే యనుకొనవలసివచ్చె. ఐన నిప్పుడుమాత్రము పోయినదేమి? వంటయింటి కుందేలువైన నీవిప్పు డెందు బోగలవు.

సుద—ఎందుబోయెదనంటిని, నీవెచ్చట నిలువుమన్న నచ్చట నిలుచువాడ. పెద్దవాడవు నీవు నీవపథగామినివైన నేటికి నేచిన్నవాడనగుట మీయాజ్ఞ నిర్వహించ వలెగదా! కావున మీరేమిచేయుమన్న నదిచేయువాడ.

యుధా—ఏమిచేయుమంటివా? మృత్యుకన్యకామణి పాణిగ్రహణ మహోత్సవమునకై యయినముగమ్మంటిని. ఈశశికళను వీడుమంటిని.

సుద—చిన్నతాతా! అట్లె సిద్ధముగనుంటిని. నొక్కసారి రెండుకార్యము లొనర్ప వీలుండదుగదా? ప్రథమమున మీమొదటియాజ్ఞ నిర్వహించనిమ్ము. పిదప రెండవదానికి చూచుకొందము ఇదె మృత్యుకన్యాకామణి పాణిగ్రహణమునకు ప్రయాణమైయుంటి నన్నేరీతి బంపవలెనో బంపుడు లేదా మీరుకూడా రావలసియుండిన రండు.

యుధా—ఈతడు చిన్నవాడవైనను మాటలయందు పెద్దవే సుమీ!

సుద—అదియంతయు మీ యాశీర్వచనమే గదా!

యుధా—ఓరీ! వాగక కన్యకామణి శత్రుజిత్తునకు వదలెదవా? యుద్ధమునకు ని కొందువా?

సుద—నేవలదంటినా? రండు నేనసహాయుండననిగదా దలచుచుంటిరి. ఒక్కవానిడీ కొట్టుటకు బల్లెములు గావలయునా? చేతగాక మాటిమాటికిని నన్ను బిలువ

నగునా! ఒక్క బాలునితో పోరాడుట కింత తామసింపవలయునా? ఇట్లని విన్న రాజలోకంబునగిపోరా? నీక్షాత్రవంత మింతియేనా? చాలు. ఇక చుట్టు మాటలతో పనిలేదు. నాకడసారి వాక్యములాలించుము. పోరగలుగుదు వేని నీవావాకాశల్యమునుజూపక భుజాబలంబు గనుపరుపుము. కాదేని నెత్తి పై గుడ్డవేసుకొని వచ్చినదారినిబొమ్ము. వెనుక టిరీతినే నీయాటలు సాగిరచ్చు ననుకొంటివా?

యుధా—అకటా! బాలుడని వధింప జేతులురాక సామంబున వినునేమోయని తామసించుచున్నందులకు మంచినీతినే యుపదేశించితివి ఇకచాలు, ఓరోరీ నీచాప సదా ఇక నీవుండబోవు, ఈదెబ్బ గాచుకొనుము.

సుద—ఇదే సిద్ధముగా నున్నాడను.

శశి—(జేతులుజోడించి నిమీలిత నేత్రయై)

పంచచామరము॥ "సమస్తజంతుజాలముఁ బ్రశస్త సత్కృపా కటా
క్షమంగళోజ్జ్వలతరంగ సంగతిం బొసంగజే
సి మేలుగూర్చి ప్రోచుతల్లి శ్రీకరిన్ నిరుఁ సదా
నమస్కరింతు బ్రోవుమమ్మ నన్ను బేర్మిమీరగన్."

(జగదంబ ప్రత్యక్షమై)

జగ—అమ్మా! శశికళా! భయముఁ జెందకుము. ఓరోరి! యుధాజత్తూ! తోసంబున నాదాసుని చంపసమకట్టిన యది నీతరమగునటరా! నీవెకాదు. మరి నీవంటివారు పదివేలు వచ్చినను నీసుదర్శనుని దాకలేరు. ఏల వృథాప్రయాసమున గుంజులాడెదవు. నీదారిని బొమ్ము.

యుధా—రాజచంద్రులారా! భీతిల్లి పరుగిడబోకుడు.

ఉ॥ "సింగముమీదనెక్కి నొక ♦ చేడియ వచ్చినయంత భీతులై
క్రుంగగనేల? రాజులధి ♦ కుల్ గలచో నొకదుర్బలుండు త
న్వంగిని జేకొనంగ నది ♦ యారసి యూరకయుండజెల్లునే
వెంగలి దీసిజంపి పృధి ♦ వీపతిపుత్రికి దెత్తు నిత్తఱిన్"॥

ఓకాంతా! నీయాకారముజూచి భయపడుదుననుకొంటివా! నీవెవరవు? ఇందేల వచ్చితివి? తొలుత జెప్పుము.

జగ—తాయుదంతము నీకేల? నన్నుజూచే భయపడనేల!

(అని బాణములేయు యుధాజిత్తు కూలుచున్నాడు.)

బాలకా! సుదర్శనా! ఇక నిర్భయుడవై యుండుము. సుబాహూ! నీసాహసమునకు మెచ్చితి. వలయువరము లడుగుము.

సుబా — ఆహా! ఏమి నాభాగ్యము! తల్లీ! తావకదర్శనముచేత నే నాకోరికలన్నియు సిద్ధించినవి. కాని—

ఉ. తావకభక్తముఖ్యుడు సుదర్శనుసంగతి జేసియేగదా
భావుకమై యశేషజన పావనమై యజముఖ్యదుర్లభం
బై వెలుగొందు త్వత్పదనవాంబురుహద్వయి నూడగంటి నీ
సేవకకోటిలో నొకనిచేసి ననుంగరుణించు మమ్మరో!

గీ. "మంత్రతంత్రమ్ము లెరుగ నీమహిమ యెరుగ
మూఢభక్తిని వినుతింతు మొఱకు నన్ను
బాలనము సేయుమమ్మ నీవాడనమ్మ
కిల్బిషమ్ములడంచి రక్షించుమమ్మ"॥

జగ — సుబాహురాజచంద్రా! నీభక్తి వర్ణనాతీతము. నీయభీష్టము చేకూరుగాక! బాలకా! సుదర్శనా! నీయభీష్ట మెఱిగింతువా?

గీ॥ "సృష్టిరక్షానిలయములు చేయజాలె
దంబ! యొకింతయిచ్చ నీకమరెనేని
యట్టి నీబట్టిడీను నన్నాదరించి
కాచితివటన్న నిదియు దుష్కరమె నీకు!"

కాని నే నెచ్చటికిన్ బోజాలను. నీయిచ్చవచ్చినట్టు జేయుము.

జగ-ఉ॥ చేసెడిదేమినాకు నృపశేఖర! యీలలితాంగితోడ మ
చ్ఛాసనమున్ వహించి విలసన్మతివై చని మీయయోధ్యసిం
హాసనమెక్కి నన్మరవ కంచితరీతిని రాజ్యమేలుకొ
న్నామ్మ సురనాథవైభవుడవై నిను నే బయినుండి కాచెదన్॥

ఇక నే నేగెద. కాని యిదిమాత్రము శ్రద్ధాళుండవై విని తత్ప్రకార మొనర్చుచుండుము.

క॥ "బలిదాన విధానంబది
యులరజతుర్దశని నవమి నష్టమనినలన్

గలకాలంబును శ్రద్ధా
కలితుడవై పూజసేయ గావలెసుమిత్ర".

అదిగాక శరత్కాలము నాయభీష్టదినములగుట యిప్పటు నవరాత్రివిశేషము సల్పి నాకు సంతసంబొనగూర్పుము. మరియు,

గీ॥ "మాఘచైత్రాశ్వినాషాఢమాసములను
నొప్పుగా జేయుమయ్య మహోత్సవములు
కృష్ణపక్ష చతుర్దశి కేవల నవ
రాత్రములు నష్టమియును పాత్రలు మిగుల"

కావున యథావిధిగా నారీతి నాచరింపుచుండుము.

క—ఆజ్ఞానువర్తి మెలంగెద.

—(అంతర్ధానము నొందును.)

బా—మహాత్మా! నీవిక ప్రస్తుత మీకాశికాపురి. సింహాసన మధిష్ఠించి తదుపరి అరోద్యాపురంబున పైతృకంబగు సింహాసనంబు నధిష్ఠించి మమ్మందరఁబాలించుచు మాచేపనులు గొనుచుండుము. నీకతంబున నాజగదీశ్వరి దర్శనంబు లభించె. ధన్యుండనైతిని. ఇదే పట్టణంబునకుఁబోయి పట్టాభిషేకమహోత్సవ మాచరింప నున్న నాయభీష్టంబు నెరవేర్పుము.

క—చిత్తము. (నిష్క్రమించుచు.)

మంగళం భవత్.



# శుద్ధపత్రిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ప్రస్తావన V. | 4 | సుదర్శనదారుఁడు | సుదర్శనధారుఁడు |
| ,, ,, | 10 | నొకమారిందొచ్చెదవా? | నొకమారిఁదువచ్చెదవా? |
| ,, VI. | 7 | మభినయిం సెంచితిరి | మభినయింప నెంచితిరి |
| ,, ,, | 26 | ఆరా | ఆర్యా |
| ,, VII. | 6 | కుడియెడమ భేదము | కుడియెడమ భేదముగ |
| ,, ,, | 27 | పట్టణాబద్ధి | పట్టణంబద్ది |
| పుట. 3 | 10 | శూక్ష్మ | సూక్ష్మ |
| ,, | 24 | శ్రీరమణియు | శ్రీరమణీయు |
| 4 | 29 | తత్రియుక్ కృహస్థు | తత్రియున్ గృహస్థు |
| 5 | 11 | లోడగూడుటకునై | లోనగూడుటకునై |
| 8 | 9 | యురగమానట్టి | యురగమైనట్టి |
| 9 | 17 | వారికిక్ | వానికిన్ |
| ,, | 21 | నిరీక్షణీయ కాన | నిరీక్షణీయము కాన |
| 10 | 20 | చెడుగఁబరిణ | చెడుగుగఁబరిణ |
| 11 | 19 | ప్రక్రమింతుము | ప్రక్రమింతును |
| 19 | 20 | నుదాసినత్వముం | నుదాసీనత్వముం |
| 20 | 11 | సృష్టికల్పవాచాతురి | సృష్టికల్పనాచాతురి |
| 24 | 16 | దర్శినంబునకు | దర్శనంబునకు |
| 25 | 16 | కరవుదీర | కఱవుదీర |
| 27 | 20 | దెంపునఁడిల్పి | దెంపునఁజిల్వ |
| 28 | 27 | మెలవచ్చుగద | మెల్లవచ్చుగద |
| 36 | 5 | చచ్చినవారపో | వారపో |
| | 30 | శూక్తులకుక్ | సూక్తులకున్ |
| 37 | 2 | నర్దము | నర్ధము |
| | 10 | మానరు | మానదు |
| | 19 | చాతినిరర్ద | భాతినిరర్ధ |
| | 23 | చందెంబునిష్ఫలంబు | చందంబునవిష్ఫలంబు |
| 40 | 23 | ప్రేసుగిని | ప్రేమగని |
| 41 | 25 | హెచ్చుగ | హెచ్చగ |
| 42 | 10 | శాస్త్రవిదూరులు | శాస్త్రవిచారులు |
| | 16 | దాకుచుండ | దాకుచుండు |
| 43 | 16 | వించుంటజూచి | వించుచుంటఁజూచి |
| 45 | 8 | నెట్టున | నెట్టుచు |

| పేజీ | పఙ్త్కి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | 21 | నీతనిపై | నతనిపై |
| 46 | 12 | బోలవనిడులన్ | బోలనినుడులన్ |
| 46 | 20 | దలప డెద వేని | దలప డెద రేని |
| 47 | 1 | ప్రయత్నములుఒనరించినను | ప్రయత్నములొనరించినను |
| | 3 | నాకాభాగ్యము | నేనాభాగ్యము |
| | 13 | ఆమ్మరో ! | అమ్మరో ! |
| | 15 | ద్దమ్మును | గధమ్మును |
| 48 | 3 | కన్దొనుమమ్మ | కన్గొనుమమ్మ |
| | 13 | వచింపవిని | వచింపరిది |
| | 15 | దుగ్విషయంబై | దృగ్విషయంబై |
| | 23 | ద్వయాంవరస్తలిం | స్వయంవరస్థలం |
| | 24 | లలితాంగికక్కునది | లలితాంగితోనిక్కునది |
| | 25 | బాలుగనున్న | చాలుగనున్న |
| 49 | 2 | మాకుగలుగు | మీకుగలుగు |
| | 7 | డస్త్రాద్రిచల | డస్త్రాచల |
| | 15 | మెసలెదగాకను | మెస వెదగాకను |
| | 22 | గణించు | గణించి |
| 51 | 4 | యేమియు | లేమియు |
| 52 | 13 | యానందించుమని | యానందింమదమని |
| 53 | 9 | కాంతపైయాశ | కాంతపైనయాశ |
| | 14 | ఆహూయమానుండటు | ఆహూయమానుండనగుట |
| | 30 | మీదనైనాయిం | మీదనైననాయం |
| 55 | 29 | ప్రగల్భలుఆడుచుంటివి | ప్రగల్భములాడుచుంటివి |
| 61 | 21 | యేనిప్పించుకొనకపోతివా | యేనిచ్చుకొనకపోతివా |
| | 24 | అవాచ్యుడనేరీతి | అవాచ్యుడవేరీతి |
| 62 | 1 | దప్పదు | దప్పును |
| 64 | 24 | నేనావత్వముం | నేనానీత్వముం |
| 65 | 6 | నీరాజ్యమునీకేటికి | నీరాజ్యమునాకేటికి |
| 71 | 10 | అజ్ఞానువర్తి మెలంగెద | ఆజ్ఞానువర్తినై మెలంగెద |

ఈశుద్ధపత్రిక తయారుచేయు భారముగూడ నాపైబడినది గాని మిత్రులు నా శక్తిని యోచింపజాలరైరి. నేనును మిత్రులమాట కెదురాడలేక శక్తికిమించిన పనిని బూనుచుంటిని, ఇందు రేఫ అకారభేదములను పరుషసరళవిచక్షణను యింకానేక వ్యాకరణ దోషంబులును అర్థానుస్వారలను చేతగాక వదలివేసి నాకు చేతనగునట్లు తయారుచేసితిని. చదువరులు నాయజ్ఞానమునకు సైరించి తప్పుల గ్రంథకర్తకు నాపాదించకుందురుగాక యని ప్రార్థించుచున్నాను. మే॥ కు॥ రామశర్మ.